అంజలీ దేవి నాగేశ్వరరావు నటించిన

అంజలీ పిక్చర్సు వారి

# పరదేశి

తెలుగు. తమిళం.

డైరెక్షన్ ప్రసాద్

ప్రొడ్యూసర్ ఆదినారాయణరావు

కెమెరా
కమల్ ఘోష్

రచన
కృష్ణశర్మ

ఆర్టు
టి వి యస్ శర్మ

మ్యూజిక్
ఆదినారాయణరావు



చూశారా!

ఆంధ్ర దేశమంతటా
ప్రేక్షకులలో నూతనాభిరుచులను
ఉదయింప చేయుచున్న
మధుర వసంతం....

నేడే చూడండి

వాహినీ వారి

# మల్లీశ్వరి

నిర్మాత దర్శకుడు
బి.యన్.రెడ్డి

స్టూడియో ..
వాహిని





... అజంతా వారి ...

# వయ్యారి భామ

యస్. వరలక్ష్మి, సులోచనాదేవి, నాగేశ్వరరావు, సి. యస్. ఆర్

వంగర, కమలాబాయ్, కుటుంబరావు, కృష్ణవేణి. గంగారత్నం, అన్నపూర్ణ

డైరెక్షన్... పి. సుబ్బారావు

మ్యూజిక్... రాజేశ్వరరావు, పాటలు... సముద్రాల, మాటలు. ఆత్రేయ

ఆర్టు... ప్రసాద్, కెమెరా... జితిన్ & చౌదరి, మేకప్.. మంగయ్య.. ... డ్యాన్స్.. ఈశ్వరలాల్

ప్రొడ్యూసర్స్... యస్. లక్ష్మినారాయణ & పి. సుబ్బారావు. స్టుడియో... న్యూటోన్

CH E PRASAD

డిస్ట్రిబ్యూటర్లు ఆంధ్ర విజయలక్ష్మీ ఫిలింసు, విజయవాడ సీడెడ్ వసంత పిక్చర్సు గుంతకల్లు

ఇతర వివరములు : అజంతా పిక్చర్సు, మద్రాసు 17

## వినపాముల సీతారామయ్యా అండ్ కో.,

పార్కు రోడ్డు :: విజయవాడ.

గుంటూరు బ్రాంచి :: రైలుపేట, గుంటూరు.

ఏజన్సీలు: ఒంగోలు - చీరాల - బాపట్ల - పొన్నూరు - తెనాలి - నర్సారావుపేట - మార్కాపురం - ఏలూరు - రాజమండ్రి

"పెట్టర్", "పెట్టర్-పీల్డింగ్" ఇంజన్లు, "కిర్లోస్కర్" పంపులు, చెఱకుగానుగలు, "కిర్లోస్కర్-బ్రష్" మోటారు పంపుసెట్లు.

సేల్సు - సర్వీసు గ్యారంటీ,

— డిస్ట్రిబ్యూటర్లు —

కృష్ణా, గుంటూరు, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలకు

## గాస్ లాంతర్లు



400 కాండిల్ పవర్ నికెల్‌పాలిష్ బ్రాండ్ కొత్తవరకు 10 సం॥ గ్యారంటి దీనిభాగములు చాల కాలం వుండును శుద్ధమైనవి అమెరికాలో తయారైనవి పెద్దసైజు కిరసనాయిల్ స్టవ్ మార్కెటులోగల అన్నిటిలోకి శ్రేష్ఠమైనది వత్తి రెంచి వగైరాలతో యివ్వబడును ధర రు 39/ పోస్టేజి రు 6/ ధరలు త్వరలో రు 72/- లకు హెచ్చింపబడును గాన వెంటనే ఆర్డరు యివ్వండి

Midland Trading Co, Ltd
Post Box 16605, (F) Calcutta 4

## ఫోటో మార్కు పరిమళ వక్కపొడి



ప్రస్తుతంలభింపగల వక్కపొడిల్లో మా ఫోటోమార్కు పరిమళ వక్కపొడి శ్రేష్టమైనది

5 పలములు (15 తులములు) ప్యాకట్లలోను, విడిగా ఒకమణుగు టిన్నులలో తక్కువ ధరలకు (F O R మదరాసు డెలివరి) సప్లయి చేయగలము

పర్లాకిమిడి, రాజమండ్రి, విజయనగరం మొదలగుచోట్లలో ప్రసిద్ధిపొందినది

మీకు కావలసిన వివిధరకముల వక్కలకు మాకు వ్రాయండి

యె. సుబ్బరాయులు శెట్టి అండ్ సన్సు,

132, ఆదియప్పనాయకన్ వీధి, మద్రాసు - 1

తంతి "SUPERIOR" టెలిఫోన్ నం 4764

శ్రీగరిమెళ్లనారాయణమూర్తిగారి అద్వితీయ

## "స్వర్ణకల్పభస్మ"



100 240

స్వర్ణకల్పచికిత్సానిలయం

## బ్లడ్‌టోన్

రక్తమును శుద్ధిచేసి నరములకు బలమునిచ్చి ఆరోగ్యమును వృద్ధిచేయు టానిక్

BLOOD TONE

MODEL PHARMACY VIJAYAWADA

మోడల్ ఫార్మశీ

విజయవాడ

Y.R.Suri

## నపుంసకతైలం

అంగ, నరములు బలహీనత చెంది చిన్నదైన, తిర్గి యథాప్రకారమై పూర్తి సౌఖ్యమనుభవించుటకు 45 యేండ్లు ప్రఖ్యాతి చెందినది

1 సీసా రూ 10/కల్లార్ వి పి రూ 1-0-0

ఆర్డరుతో రు 1/- పంపవలెను

డా॥ రత్నం సన్స్ మెడికల్‌హాల్

మలకపేట బిల్డింగ్స్,

హైద్రాబాద్, దక్కన్

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

# సంక్రాంతి సినిమా సంచిక

జనవరి 1952



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రణాలయము, మద్రాసు 1

వెల: ఒక రూపాయి.

సంపుటము 44 సంచిక 19

# తెలుగు టాకీలు
# (1931—1950)

## 1931

| | | |
|---|---|---|
| 1 | కృష్ణా మూవీటోన్ | 'ప్రహ్లాద' |

## 1932

| | | |
|---|---|---|
| 2 | కొలెపు పిక్చర్సు | 'పాదుక' |
| 3 | ,, ,, | 'శకుంతల' |

## 1933

| | | |
|---|---|---|
| 4 | కృష్ణామూవీటోన్ | 'సావిత్రి' |
| 5 | ఈస్టిండియాఫిలిమ్సు | 'సావిత్రి' |
| 6 | మదన్ థియేటర్సు | 'చింతామణి' |
| 7 | సరస్వతీ సినీటోన్ | 'పృథ్వీపుత్ర' |
| 8 | ఇంపీరియల్ | '[illegible]' |
| 9 | ఈస్టిండియా | 'రామదాసు' |

## 1934

| | | |
|---|---|---|
| 10 | వేల్ పిక్చర్సు లిమిటెడ్ | 'సీతాకల్యాణం' |
| 11 | ఈస్టిండియా ఫిలిమ్సు | 'లవకుశ' |
| 12 | అరోరాఫిలిం కంపెనీ | 'శ్రీ కృష్ణ తులాభారం' |

## 1935

| | | |
|---|---|---|
| 13 | అరోరా | 'అహల్య' |
| 14 | భారత లక్ష్మి పిక్చర్స్ | 'సక్కుబాయి' |
| 15 | రాధాఫిలిం కంపెనీ | 'కుచేల' |
| 16 | ,, ,, | 'లంకా దహనం' |
| 17 | స్టార్ కంబైన్సు లిమిటెడ్ | 'హరిశ్చంద్ర' |
| 18 | వేల్ పిక్చర్సు లిమిటెడ్ | 'కృష్ణలీల' |
| 19 | అరోరా ఫిలిం కంపెనీ | 'అనసూయ' |

## 1936

| | | |
|---|---|---|
| 20 | శ్రీ సత్యనారాయణ ఫిలిం కంపెనీ | 'ప్రమీలార్జునీయం' |
| 21 | ఓరియంటల్ క్లాసికల్ పిక్చర్సు | 'భక్త కబీర్' |
| 22 | ఈస్టిండియా ఫిలిం కంపెనీ | 'ధృవ-అనసూయ' |
| 23 | శ్రీ కృత్తివెంటి నాగేశ్వరరావు | 'ప్రేమ విజయం' |
| 24 | సరస్వతిటాకీస్ లిమిటెడ్ | 'ద్రౌపదీ వస్త్రాపహరణం' |
| 25 | లక్ష్మీ ఫిలిమ్సు | 'ద్రౌపదీ మాన సంరక్షణం' |
| 26 | దేవదత్తా ఫిలిమ్సు | 'సతీ సులోచన' |
| 27 | శ్రీ దుర్గా సినీటోన్ | 'సంపూర్ణ రామాయణం' |
| 28 | [illegible] పిక్చర్ సర్క్యూట్ | 'వీరాభిమన్యు' |
| 29 | వేల్ పిక్చర్స్ లిమిటెడ్ | 'మాయా బజార్' |
| 30 | శ్రీరామా ఫిలిమ్సు | 'సతీ తులసి' |

## 1937

| | | |
|---|---|---|
| 31 | వెంకట నారాయణటాకీస్ | 'విజయదశమి' |
| 32 | స్టార్ కంబైన్స్ లిమిటెడ్ | 'సారంగధర' |
| 33 | సరస్వతిటాకీస్ లిమిటెడ్ | 'కనకతార' |
| 34 | క్వాలిటి పిక్చర్స్ అండ్ సరస్వతి సినీటోన్ | 'దశావతారాలు' |
| 35 | నేషనల్ మూవీటోన్ కంపెనీ లిమిటెడ్ | 'మోహిని రుక్మాంగద' |
| 36 | భారత లక్ష్మి పిక్చర్స్ | 'రుక్మిణీ కల్యాణం' |
| 37 | వాడియా మూవీటోన్ | 'వర నారాయణ' |
| 38 | అరోరా ఫిలిం కార్పొరేషన్ | 'విప్రనారాయణ' |
| 39 | మద్రాస్ యునైటెడ్ ఆర్టిస్ట్స కార్పొరేషన్ | 'బాలయోగిని' |

## 1938

| | | |
|---|---|---|
| 40 | సెంట్రల్ స్టుడియో | 'తుకారాం' |
| 41 | శ్రీరామా ఫిలిమ్సు | 'చిత్ర నళీయం' |
| 42 | ఆంధ్రాటాకీస్ | 'సత్యనారాయణ వ్రతం' 'చల్ మోహన రంగా' 'కాసుల పేరు' |
| 43 | రోహిణీ పిక్చర్సు | 'గృహలక్ష్మి' |
| 44 | జయా ఫిలిమ్సు | 'జరాసంధ' |
| 45 | ఫేర్ మాంట్ ఫిలిం కంపెనీ | 'సతీబకావళి' |
| 46 | వి వి రామానందం, రాధా ఫిలిం కంపెని | 'కచదేవయాని' |
| 47 | కుబేరా ఫిలిమ్సు | 'మార్కండేయ' |

116 ప్రభాకర ప్రొడక్షన్సు 'మంగళసూత్రం'
117 సారథీఫిలిమ్సు 'గృహప్రవేశం'
118 రేణుకాఫిలిమ్సు 'త్యాగయ్య'
119 తిలకంపిక్చర్సు 'వరూధిని'
120 భారత్ 'వనరాణి'

## 1947

121 శోభనాచలపిక్చర్సు 'గొల్లభామ'
122 వాహినీపిక్చర్సు 'యోగివేమన'
223 జ్యోతిపిక్చర్సు 'సేతుబంధన్'
124 శారదా ప్రొడక్షన్సు 'పల్నాటియుద్ధం'
125 వెంకట్రామాపిక్చర్సు 'బ్రహ్మరథం'
126 శోభనాచలపిక్చర్సు 'సంసారనారద'

## 1948

127 భరణిపిక్చర్సు 'రత్నమాల'
128 వైజయంతిఫిలిమ్సు 'వింధ్యరాణి'
129 ఛత్రపతిపిక్చర్సు 'రాధిక'
130 ప్రతిభాపిక్చర్సు 'బాలరాజు'
131 శ్యామలాఫిలిమ్సు 'గీతాంజలి'
132 శోభనాచలపిక్చర్సు 'మదాలస'
133 మురళీ పిక్చర్సు 'భక్త శ్రీయాళ'

## 1949

134 స్వతంత్రాఫిలిమ్సు 'ద్రోహి'
135 శోభనాచల పిక్చర్సు 'కీలుగుఱ్ఱం'
136 పద్మనాభా ప్రొడక్షన్సు 'రక్తరేఖ'
137 భరణీపిక్చర్సు 'లైలామజ్ను'
138 స్వస్తిక్ ఫిలిమ్సు 'ధర్మాంగద'
139 ఎం ఆర్ ఏ ప్రొడక్షన్సు 'మనదేశం'
140 వాహినీపిక్చర్సు 'గుణసుందరి'

## 1950

141 జెమినీపిక్చర్సు 'అపూర్వసహోద-
[రులు (18678)'
142 అశోకాఫిలిమ్సు 'వాలిసుగ్రీవ'
(16450)
143 ఎం ఆర్ ఏ అండ్ శోభనాచల 'లక్ష్మమ్మ'(16000)
144 ప్రతిబాపిక్చర్సు 'శ్రీలక్ష్మమ్మకథ'
(18883)
145 రాగిణీఫిలిమ్సు 'తిరుగుబాటు'
(18500)

146 విజయాప్రొడక్షన్సు 'షావుకారు'
147 శోభనాచల అండ్ బి ఏ
సుబ్బారావు } 'పల్లెటూరిపిల్ల'
148 ప్రకాష్‌ప్రొడక్షన్సు 'మొదటిరాత్రి'
149 ఏ వి యం ప్రొడక్షన్సు 'జీవితం'
150 ప్రతిభా పిక్చర్సు 'స్వప్నసుందరి'
151 ఎల్లైడు పిక్చర్సు 'పరమానందయ్య-
[శిష్యులు'
152 నందలాల్ బజేవియా 'మాయారంభ'
153 నవీనాఫిలిమ్సు 'ఆహుతి'
154 పక్షిరాజా 'బీదలపాట్లు
155 యూనిటీపిక్చర్సు 'సాయిబాబా'
156 సాధనా ,, 'సంసారం'

## 1951

157 టి యన్ టి ప్రొడక్షన్సు 'అదృష్టదీపుడు'
158 సరస్వతీటాకీస్ 'ఆకాశరాజు'
159 పద్మనాభా ప్రొడక్షన్సు 'చంద్రవంక'
160 శోభనాచలపిక్చర్సు 'తిలోత్తమ'
161 జెమినీ పిక్చర్సు 'మంగళ'
162 రాజరాజేశ్వరి పిక్చర్సు 'సౌదామిని'
163 సారథీఫిలిమ్సు 'అగ్నిపరీక్ష'
164 విజయా ప్రొడక్షన్సు 'పాతాళభైరవి'
165 విజయలక్ష్మి ,, 'పేరంటాలు'
166 రోహిణీ పిక్చర్సు 'నిర్దోషి'
167 స్వాతి పిక్చర్సు 'రూపవతి'
168 అశ్వనీ పిక్చర్సు 'మాయలమారి'
169 జ్ఞానాంబికా పిక్చర్సు 'మంత్రదండం'
170 మోడరన్ థియేటర్సు 'సర్వాధికారి'
171 ఆర్ ఎస్ ప్రకాష్ ప్రొడక్షన్సు 'మాయపిల్ల'
172 ప్రకాష్ ప్రొడక్షన్స 'దీక్ష'
173 వినోదా ప్రొడక్షన్సు 'స్త్రీ సాహసం'
174 యన్ యస్ కె ఫిలిమ్సు 'పెళ్లికూతురు'
175 మోడరన్ థియేటర్సు 'ఆడజన్మ'
176 వాహిని పిక్చర్సు 'మల్లీశ్వరి'

(కూర్పు శ్రీ అప్పిచెర్ల సుబ్బారావు)

# 1951 లో విడుదల అయిన

# తెలుగు చిత్రాలు

1951లో ఈ క్రింది తెలుగు చిత్రాలు విడుదల అయినవి :

| | | | |
|---|---|---|---|
| 1 | జెమినీవారి | "మంగళ"— | జనవరి 14 |
| 2 | ఏ ఏ పిక్చర్స్‌వారి | "చంద్రవంక"— | ఫిబ్రవరి 2 |
| 3 | శోభనాచలవారి | "తిలోత్తమ"— | ఫిబ్రవరి 16 |
| 4 | త్రిమూర్తివారి | "ఆకాశరాజు"— | ఫిబ్రవరి 16 |
| 5 | రోహిణీవారి | "నిర్దోషి"— | ఫిబ్రవరి 24 |
| 6 | విజయావారి | "పాతాళభైరవి'— | మార్చి 15 |
| 7 | రవి వారి | "పెంకిపిల్ల"— | ఏప్రిల్ 7 |
| 8 | సారథీ వారి | "అగ్ని పరీక్ష"— | ఏప్రిల్ 7 |
| 9 | శ్రీ రాజరాజేశ్వరీవారి | "సౌదామిని"— | ఏప్రిల్ 11 |
| 10 | విజయలక్ష్మివారి | "పేరంటాలు"— | మే 25 |
| 11 | టి ఎన్ టి వారి | "నవ్వితే నవరత్నాలు"— | జూన్ 7 |
| 12 | అశ్వనీవారి | "మాయలమారి"— | జూన్ 15 |
| 13 | స్వాతీవారి | "రూపవతి"— | జూలై 11 |
| 14 | వినోదావారి | "స్త్రీ సాహసం"— | ఆగస్టు 9 |
| 15 | ప్రకాశ్ వారి | "దీక్ష" | సెప్టెంబరు 5 |
| 16 | కె అండ్ కె, తిరుమలైవారి | "జీవితనౌక"— | సెప్టెంబరు 14 |
| 17 | జ్ఞానాంబికావారి | "మంత్రదండం"— | సెప్టెంబరు 29 |
| 18 | మోడరన్ థియేటర్స్‌వారి | "సర్వాధికారి''— | అక్టోబరు 5 |
| 19 | ప్రకాశ్ శంకర్ వారి | "మాయపిల్ల"— | అక్టోబరు 26 |
| 20 | ఎసెన్కే వారి | "పెళ్లికూతురు''— | నవంబరు 10 |
| 21 | మోడరన్ థియేటర్స్‌వారి | ''ఆడజన్మ"— | నవంబరు 24 |
| 22 | వాహినీవారి | ''మల్లీశ్వరి"— | డిసెంబరు 20 |

ఈ యేడు చిత్రాలు విడుదల చేసినవారిలో మోడరన్ థియేటర్స్‌వారు తప్ప మరే కంపెనీవారు కూడా ఒక తెలుగుచిత్రాన్ని మించి విడుదల చేయలేదు

పై చిత్రాలలో 5 చిత్రాలు ఇతర భాషా చిత్రాలకు తెలుగు తర్జుమాలు అవి జెమినీవారి ''మంగళ", కె అండ్ కె వారి "జీవిత నౌక'', మోడరన్ థియేటర్స్‌వారి "సర్వాధికారి'', "ఆడజన్మ'', ఎసెన్కే వారి ''పెళ్లికూతురు''

పై చిత్రాలలో 7 తెలుగు చిత్రాలు ఇతర భాషలలోకూడా తీయబడ్డాయి అవి శోభనాచలవారి ''తిలోత్తమ'', రోహిణీవారి ''నిర్దోషి'', విజయావారి ''పాతాళభైరవి", శ్రీ రాజరాజేశ్వరివారి ''సౌదామిని'', అశ్వినీవారి ''మాయలమారి", వినోదావారి ''స్త్రీ సాహసం", ప్రకాశ్ వారి ''దీక్ష"

''చంద్రవంక", ''ఆకాశరాజు'', ''పెంకిపిల్ల'', ''పేరంటాలు'', ''మాయలమారి'', ''రూపవతి'', ''స్త్రీ సాహసం'', ''మంత్రదండం", ''మాయపిల్ల" చిత్రాలు ఆయా కంపెనీలవాలూకు తొలిచిత్రాలు కారణాంతరాలచేత ఇందులో కొన్ని కంపెనీలు చిత్రనిర్మాణం నుంచి విరమించుకున్నవి మిగిలినవి— స్వాతీ, వినోదా వగైరాలు—మళ్లా కొత్త చిత్రాలు ప్రారంభించినవి

రోహిణీ, వాహినీ సంస్థలకు చెందిన హెచ్ ఎం రెడ్డి, బి యన్ రెడ్డిగార్లు చాలాకాలం చిత్రనిర్మాణానికి దూరంగాఉండి 1951లో ''నిర్దోషి'', ''మల్లీశ్వరి'' చిత్రాలు విడుదల చేయడం ఒకవిశేషం

1951లో విడుదలైన 22 చిత్రాలలో 16 చిత్రాలు జానపద చిత్రాలు సాంఘికచిత్రాలు మొత్తం చిత్రాలలో సుమారు సగంవంతు మాత్రమే అన్ని చిత్రాలలోకీ అధికంగా ప్రజాదరణ సంపాదించి శతదినోత్సవాలూ, జూబిలీయూ జరుపుకున్న చిత్రం విజయావారి ''పాతాళభైరవి'' జానపదచిత్రం.

# స్టూడియోలు



## శోభనాచల స్టూడియో

స్థాపితం 1938 లో అధిపతి మీర్జాపురం రాజా మేనేజరు ఆర్. వి. చిన్నారావు మద్రాసులోని స్టూడియో లన్నిటిలోకీ అధికంగా తెలుగుచిత్రాలు ఈ స్టూడియోలోనే తయారవుతాయి



శోభనాచల స్టూడియో అధిపతి పిఠాపురం రాజా

ఈ స్టూడియోలో ఈ క్రింది టెక్నీషియనులు ప్రస్తుతం పనిచేస్తున్నారు:

కెమెరా. ఎం ఎం మూర్తి

సౌండు ఎం బి వాల్కే

ఆర్టు టి వి ఎస్ శర్మ

1951 లో ఈ స్టూడియోలో ఈ క్రింది చిత్రాలు తయారయాయి

తిలోత్తమ (స్టూడియో చిత్రం)

మాయలమారి

రూపవతి

పేరంటాలు

అగ్నిపరీక్ష (దాదాపు సగం)

దీక్ష (కొంతభాగం,

మంత్రదండం (కొంతభాగం)

ప్రస్తుతం ఈ స్టూడియోలో ఈ క్రింది చిత్రాలు తయారవుతున్నాయి:

ప్రియురాలు

సాహసం (స్టూడియో చిత్రం)

పాలేరు

ఆడబ్రతుకు

ఆదర్శం

శాంతి

మరదలు పెళ్ళి







ఎన్. టి. రామారావు



# వాహిని స్టూడియో

1949 లో పని ప్రారంభించింది దీని నిర్మాణం ప్రారంభించినది బి. యన్ రెడ్డి కాని నిర్మాణం పూర్తి కాకమునుపే విజయా ప్రొడక్షన్స్ నిర్వహణ కిందకి వచ్చింది. మేనేజింగ్ డైరక్టర్ బి. నాగిరెడ్డి. దేశంలోని గొప్ప స్టూడియోలలో ఒకటి

ఈ స్టూడియోలో ప్రస్తుతం ఈ కింది టెక్నీషియనులు పని చేస్తున్నారు:

కామెరా : మార్కస్ బార్ట్లీ, ఆదీ ఇరానీ

సౌండు : కృష్ణయ్యర్ బి. ఏ , శివరాం బి. ఏ., బి యస్ సి.

ఆర్టు : గోఖలే, కళాధర్

లాబ్ : సేన్‌గుప్త

డాన్స : పసుమర్తి కృష్ణమూర్తి

ఎడిటింగ్ : జంబులింగం

మ్యూజిక్ : ఘంటసాల

స్క్రిప్ట్ : పింగళి నాగేంద్రరావు

డైరక్షన్ · కామేశ్వరరావు

ప్రొడక్షన్ : నాగిరెడ్డి, చక్రపాణి

1951 లో ఈ స్టూడియోలో ఈ కింది చిత్రాలు తయారై వెలువడ్డాయి.

పాతాళభైరవి (స్టూడియో చిత్రం)

మంత్రదండం

మల్లీశ్వరి

స్త్రీసాహసం (దాదాపు సగం)

ప్రస్తుతం ఈ స్టూడియోలో ఈ కింది చిత్రాలు తయారవుతున్నాయి:

టింగ్ రంగా

రాగిణివారి ఠివ చిత్రం

ప్రేమ

పరదేశి

పెళ్లిచేసి చూడు (స్టూడియో చిత్రం)

చంద్రహారం (స్టూడియో చిత్రం)

రక్షారేఖ

జ్యోతి



చక్రపాణి



పింగళి నాగేంద్రరావు





ఆది ఇరానీ



మార్కస్ బార్ట్లే



పినుమర్తి కృష్ణమూర్తి



యండమూరి జోగారావు, విజయా పబ్లిసిటీ ఆర్టిస్టు



**పద్మనాభం, బాలకృష్ణ**

# న్యూటోన్ స్టూడియో

స్థాపితం 1938 మేనేజింగ్ డైరెక్టర్ ఆర్ ఎమ్ రామనాథన్

ఈ స్టూడియోలో ఈ క్రింది టెక్నీషియనులు పనిచేస్తున్నారు వీరు భాగస్తులు కూడాను

టెక్నికల్ డైరెక్టర్ : జితిన్ బెనర్జీ

సౌండ్ ఇంజనీర్ దిన్షా కె టెహరానీ

ఆర్ట్ డైరెక్టర్ : ఎఫ్ నాగూర్

లాబ్, టి ఆర్ యతిరాజులు

1951 లో ఈ స్టూడియోలో తయారైన ఈ క్రింది చిత్రాలు వెలువడ్డాయి :

చంద్రవంక

నవ్వితే నవరత్నాలు

అగ్నిపరీక్ష (సగం)

ఈ స్టూడియోలో ప్రస్తుతం తయారవుతున్న చిత్రాలు :

మానవతి (కొంతభాగం)

సయారిభాను

అమ్మలక్కలు

సందేహి



జితిన్ బెనర్జీ
న్యూటోన్ టెక్నికల్ డైరెక్టర్


11
ప్రారంభం
శోభనాచల వారి
సాహసం
శీఘ్రగమనముగల ఉద్రేకపూరితమైన
సాంఘిక చిత్రము...
డైరెక్టర్...
మీర్జాపురం రాజా వారు




# జెమినీ (మూవీలాండ్) స్టూడియో

పూర్వం ఎం పి పి సి స్టూడియో, 1940 నుంచి ఎస్ ఎస్. వాసన్ ఆధిపత్యంకింద జెమినీస్టూడియోగా మారింది. తమిళం, తెలుగు, హిందీ భాషలలో ఈ స్టూడియో చిత్రాలను తయారు చేస్తున్నది. ఉదయశంకర్ "కల్పన" ఈ స్టూడియోలోనే తయారయింది. ఇక్కడ తయారైన స్టూడియో చిత్రాలు 17, ఇతర ప్రొడ్యూసర్ల చిత్రాలు 14.

ఈ స్టూడియోలో ఈ కింది టెక్నీషియనులు ప్రస్తుతం పని చేస్తున్నారు

చీఫ్ ఎగ్జిక్యూటివ్ : కె. వి. వి. శర్మ
ప్రొడక్షన్ కార్యదర్శి కె. జె మహదేవన్
సౌండ్ ఇంజనీర్ : ఓగ్స్
రికార్డిస్టులు : రంగారావు, కె ఆర్. రామస్వామి, శ్యామ్‌సుందర్, ఎస్ సి గాంధి
కెమెరా : ఎల్లప్ప, పి వి. రామకృష్ణన్, నటరాజన్
లాబ్ . వి. రామస్వామి
ఎడిటింగ్ : ఎన్. కె. గోపాల్, చంద్ర, ఎన్ ఆర్. క్రిష్ణస్వామి, ఉమానాథ్ రావ
డాన్స్ : జయశంకర్
సంగీతం : ఎం. డి పార్థసారథి, ఈమని శంకరశాస్త్రి
డైరెక్షన్ : పాటలు, మాటలు, కొత్తమంగళం సుబ్బు
ఆర్టు : కే ఆర్ శర్మ, సయ్యద్ అహ్మద్, ఎం. ఎస్ జానకిరాం
పబ్లిసిటీ : వి. కే ఎన్ చారి

1951 లో ఈ స్టూడియోలో తయారైన తెలుగు చి[illegible]లు :
మంగళ (స్టూడియో చిత్రం)
సౌదామిని

ప్రస్తుతం మరికొన్ని స్టూడియో చిత్రాలు తెలుగుభాషలో కూడా తయారవుతున్నాయి.



ఎస్ ఎస్ వాసన్



కె వి వి. శర్మ



పి రంగారావు



సయ్యద్ అహ్మద్



సహదేవ్ రావ్ తప్కీరే



ఎస్ కే గోపాల్



వి. కే. ఎస్ చారి



ఈమని శంకరశాస్త్రి



కొత్త మంగళంసుబ్బు



సి. ఇ. బిగ్స్



సి వి. రామకృష్ణన్



శ్యామసుందర్



జానకిరామన్



కే ఆర్ శర్మ



పి ఎల్లప్ప



కె జె మహాదేవన్



కే ఆర్. రామస్వామి



ఎన్ ఆర్. కృష్ణస్వామి



ఉమానాథరావు



వి రామస్వామి



ఎస్ సి గాంధి



నటరాజన్



చంద్రు



ఎం డి పార్థసారథి



నెప్ట్యూన స్టూడియో



డబ్ల్యు, ఆర్ సుబ్బారావు చీఫ్ కామెరామాన్



బాబూ దాస్ స్టూడియో మేనేజరు

రాజ్యం పిక్చర్సు వారి

# దాసి

రాజ్యం • శాంతకుమారి • హేమలత •
కనకం • సూర్యకాంతం • కాంతమ్మ •
N.T. రామారావు • రంగారావు •
రేలంగి • శ్రీవత్స • దొరస్వామి

ప్రొడ్యూసర్

**రాజ్యం**

సూపర్‌విజన్ డైరెక్టర్

**ప్రసాద్**

డైరెక్టర్

**C.V. రంగనాథ దాస్**

కథ ... సదాశివబ్రహ్మం ...
పాటలు ... ఆత్రేయ ...
కెమెరా ... రహమాన్ ...
మ్యూజిక్ ... సుబ్బరామన్ ...
ఆర్టు ... టి.వి.యస్. శర్మ ...
డాన్సులు ... కృష్ణమూర్తి

SARMA TVS

రాజ్యం పిక్చర్స్—మదరాసు-17

# జనవరి విడుదల



లక్ష్మీకాంత కృష్ణకుమారి-కనకం.
జగ్గయ్య చంద్రశేఖర్ రేలంగి....
రామమూర్తి. నటించిన,

భారతలక్ష్మీ వారి,

# ప్రియురాలు



డైరెక్షన్
**గోపీచంద్**
పాటలు
**అనిసెట్టి**
మ్యూజిక్
**రాజేశ్వరరావు-అద్దేపల్లి**
ప్రొడ్యూసర్
**డి. కృష్ణమూర్తి**

ఆంధ్ర: గోకులకృష్ణా ఫిలిమ్స్, విజయవాడ.
సీడెడ్: శాంతి పిక్చర్స్, గుంతకల్లు.
మైసూర్: జయంత్ పిక్చర్స్, బెంగుళూరు.
నైజాం: ప్రీమియర్ ఫిలిమ్స్, సికందరాబాదు.



ఎం సోమసుందరం (సోమ) స్టూడియో మేనేజింగ్ పార్ట్నర్

పూర్వం దీని పేరు సుందరం సౌండ్ స్టూడియోస్ 1946 నెప్ట్యూన్ స్టూడియోస్ గా మారింది 1951 లో జూపిటర్ వారి యాజమాన్యంకిందికి వచ్చింది మేనేజింగ్ పార్ట్నర్ ఎం సోమసుందరం మేనేజరు బాబూదాస్

ఈ క్రింది టెక్నీషియనులు ప్రస్తుతం ఈ స్టూడియోలో పనిచేస్తున్నారు

కొమెరా డబ్ల్యు ఆర్ సుబ్బారావు, పి రామలింగం

లాబ్ (జూపిటర్) : ధీరేన్ దాస్ గుప్తా

సౌండు ఎ గోవిందస్వామి, వి చంద్రశేఖరన్, ఎస్ విశ్వనాదన్

1951 లో ఈ స్టూడియోలో తయారై ఈ క్రింది చిత్రాలు వెలువడ్డాయి :

ఆకాశరాజు
నిర్దోషి
మాయపిల్ల
స్త్రీసాహసం (సగం)

ఈ స్టూడియోలో ప్రస్తుతం ఈ క్రింది చిత్రాలు తయారవుతున్నాయి

మరదలు పెళ్ళి
చిన్నకోడలు
చిన్నమ్మకథ
భాస్కర్ ప్రొడక్షన్స్ నం 1
రాజేశ్వరి



వి ను వ

పి రామలింగం
కెమేరామన్



ఎస్ విశ్వనాథం
సౌండ్ రికార్డిస్టు







నాగేశ్వరరావు



నెప్ట్యూన్ స్టూడియోకు చెందిన సౌండ్ ఇంజనీర్లు,
(పైన) వి సి శేఖర్ -(పక్క-) గోవిందస్వామి



# స్టార కంబైన్స్

స్టూడియో నిర్మాణం 1946 లో ఆరంభమై 1949 లో పూర్తి అయింది మేనేజింగ్ డైరెక్టర్ వి రామయ్య మేనేజర్ ఎస్ ఎస్ సుందరం

ఈ క్రింది టెక్నీషియనులు ఈ స్టూడియోలో పని చేస్తున్నారు

కామెరా గోవిందన్

సౌండ్ ఎం రాధాకృష్ణ, సుబ్బరామన్, రాజగోపాల్, కన్నియప్పన్

ఆరు వర్తార్కర్, లోకనాదన్

ఎడిటింగ్ ఎన్ ఎం శంకర్

లాబ్ (విజయా పిసి) మజీద్

1951 లో ఈ స్టూడియోలో తయారై విడుదల అయిన చిత్రాలు

దీక్ష

నిర్దోషి (కొంతభాగం)

స్త్రీసాహసం (కొంతభాగం)

ఈ స్టూడియోలో ఇప్పుడు తయారవుతున్న చిత్రాలు

మానవతి

సొసైటీవారి నం 1

శ్రీ వీరబేతాళ

జయలక్ష్మి (స్టూడియో చిత్రం) దీనికి తెలుగులో డబ్బింగ్ జరుగుతోంది



# ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు

## తుమ్మలపల్లి రామచంద్రరావు (చంద్ర)

జెమినీవారి "మంగళ"కు డైరెక్టరు జననం 1912 1936 లో సినిమా పరిశ్రమలో ప్రవేశించి అసిస్టెంటు డైరెక్టరుగా, ఎడిటరుగా, దర్శకుడుగా పనిచేశారు 1942 నుండి జెమినీలో అసిస్టెంటు డైరెక్టరుగా, ఎడిటరుగా పనిచేస్తున్నారు

## ఎఫ్. నాగూర్

ఎ ఎ పిక్చర్స్‌వారి "చంద్రవంక"కు డైరెక్టరు జనన 1910 1935 లో సినిమారంగంలో ప్రవేశించి ఆర్టు డైరెక్టరుగా, డైరెక్టరుగా, ప్రొడ్యూసరుగా పనిచేశారు 1937-38 నుంచి న్యూటోన్ స్టూడియోలో ఆర్టు డైరెక్టరుగానూ, భాగస్వామిగానూ ఉంటున్నారు 1951 లో నాగూర్ సినీప్రొడక్షన్స్ స్థాపించారు మొదటి తమిళ చిత్రం "అమరకవి" త్వరలో విడుదల కానున్నది 'సందేహి" అన్న చిత్రాన్ని తెలుగు, తమిళభాషలలో తయారు చేయనున్నారు



హెచ్. ఎం రెడ్డి

రోహిణీవారి "నిర్దోషి"కి ప్రొడ్యూసరు, డైరెక్టరు, టాకీల యుగం రాకపూర్వమే ఈ భరతదేశంలో చిత్రనిర్మాతగా కీర్తి గడించారు, 1924 లో సినిమారంగంలో అసిస్టెంటు డైరెక్టరుగా ప్రవేశించి కొద్దిరోజులలో డైరెక్టరు హోదా అందుకున్నారు. మొట్టమొదటి హిందీ టాకీచిత్రం "ఆలం ఆరా", మొట్టమొదటి తెలుగు టాకీచిత్రం "భక్త ప్రహ్లాద", మొట్టమొదటి తమిళటాకీ "భక్త కాళిదాసు" ఆయన డైరెక్షన్‌తోనే వెలువడ్డాయి 1934-36 లో కొల్హాపూర్‌లో కొల్హాపూర్ సినిటోన్, శాలినీ సినిటోన్లకు అధిపతిగా ఉన్నారు 1937 లో మద్రాసులో రోహిణీ సంస్థ ఏర్పరచి "గృహలక్ష్మి", "తెనాలిరామకృష్ణ", "ధర్మమే జయం" మొదలైన చిత్రాలు తయారుచేశారు కారణాంతరాలచేత రోహిణీ సంస్థనుండి 1948-49 లో చిత్రాలు వెలువడలేదు 1950 లో "నిర్దోషి" చిత్రం తెలుగు, తమిళభాషలలో ప్రారంభించి 1951 లో విడుదలచేశారు గతమాసంలో రోహిణీ స్టూడియో నెలకొల్పి రెండు చిత్రాలను తెలుగు, తమిళభాషలలో తీయడానికీ, అందులో ఒకటి హిందీలో కూడా తయారుచేయడానికీ ఏర్పాటు చేస్తున్నారు

## బి నాగిరెడ్డి

విజయావారి "పాతాళ భైరవి"కి ప్రొడ్యూసరు వాహినీ ప్రొడక్షన్సుకూ, విజయా ప్రొడక్షన్సుకూ మేనేజింగ డైరెక్టరు 1949 నుండి వాహినీస్టూడియో నిర్వాహకులు చక్రపాణితో కలిసి "షావుకారు" "పాతాళభైరవి" చిత్రాలకు ప్రొడ్యూసరుగా ఉన్నారు "పెళ్లిచేసి చూడు", "చంద్రహారం" తయారు చేస్తున్నారు

## చక్రపాణి

విజయావారి "పాతాళభైరవి"కి కో ప్రొడ్యూసరు వాహినీ విజయాసంస్థలలో వాటాదారు 1939 లో సినిమారంగంలో ప్రవేశించి రచయితగా ప్రొడ్యూసరుగా పనిచేస్తున్నారు "ధర్మపత్ని"కీ, "స్వర్గసీమ"కూ కథా సంభాషణలూ రాశారు. "షావుకారు"కు స్క్రిప్టూ, కథ రాశారు నాగిరెడ్డితోబాటు "షావుకారు", "పాతాళభైరవి"కి ప్రొడ్యూసరు ప్రస్తుతం తయారవుతున్న "పెళ్లిచేసి చూడు" చిత్రానికి కథ, స్క్రిప్టూ రాశారు "పెళ్లిచేసి చూడు", "చంద్రహారం" చిత్రాలకు కో ప్రొడ్యూసరుగా పనిచేస్తున్నారు

## కె వి రెడ్డి

విజయావారి "పాతాళభైరవి" డైరెక్టరు జననం 1912. 1937 లో "గృహలక్ష్మి" చిత్రంలో సౌండు ఎప్రెంటిస్ గా ప్రవేశించి ప్రొడక్షన్ డిపార్టుమెంట్‌లోకి తీసుకోబడ్డారు వాహిని సంస్థలో మొదటినుంచీ భాగస్వామిగా ఉండి చీఫ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ గా పనిచేసి, "పోతన"కు మొదటిసారిగా దర్శకత్వం వహించారు వాహినీవారి "వేమన", "గుణసుందరి కథ" లకు ప్రొడ్యూసరుగా, డైరెక్టరుగా పనిచేశారు ప్రస్తుతం వాహినీ తరఫున "పెద్దమనుషులు" అన్న సాంఘికచిత్రం తీయబోతున్నారు.

కె బి రెడ్డి



## కె బి నాగభూషణం

శ్రీ రాజరాజేశ్వరీవారి "సౌదామిని"కి ప్రొడ్యూసరు, డైరెక్టరు జననం 1902 1935 లో "ద్రౌపదీ వస్త్రాపహరణం"లో సినిమారంగ ప్రవేశం 1937 లో "గృహలక్ష్మి"కి ప్రొడక్షన్ మేనేజరు 1938 లో భవానీవారి "చండిక"కు భాగస్వామి, ప్రొడక్షన్ మేనేజరు 1939 లో శ్రీ రాజరాజేశ్వరీ సంస్థ స్థాపించి వరుసగా "సుమతి", "హరిశ్చంద్ర" (తమిళం) "పాదుక", "తులసీ జలంధర్" (తమిళం), "నవజీవన్" చిత్రాలు తీశారు 1951 లో "సౌదామిని" తెలుగు తమిళ భాషలలో తయారుచేశారు ప్రస్తుతం "పేదరైతు" రెండు భాషలలో తీస్తున్నారు

## బి వి రామానందం

రవి పిక్చర్స్‌వారి "పెంకిపెళ్ల"కు ప్రొడ్యూసరు, డైరెక్టరు జననం 1904 1929 లో రాజమండ్రిలో ఆనంద పిక్చర్స్ అన్న డిస్ట్రిబ్యూషన్‌సంస్థ ప్రారంభించి 1933 దాకా నడిపారు 1934 లో ప్రొడ్యూసరు, డైరెక్టరుగా "సక్కుబాయి" తీశారు తరువాత వరుసగా "కచదేవయాని" (1938), "పాండురంగ విఠల్" (1940), "వరూధిని" (1946), "పెంకిపెళ్ల" (1951) నిర్మించారు ప్రస్తుతం "జైవీరభేతాళ" అన్న చిత్రాన్ని తయారు చేస్తున్నారు

## కె భాస్కరరావు

సారథీవారి "అగ్నిపరీక్ష"కు జాయింట్ ప్రొడ్యూసరు జననం 1912 1946 లో "గృహప్రవేశం"తో సినిమారంగంలో ప్రవేశించి భాగాదారుగా ఉన్నారు అదేవిధంగా స్వతంత్రవారి "ద్రోహి"కి కూడా భాగస్వామిగా ఉన్నారు 1947 లో ప్రిమియర్ ఫిలిమ్స్ స్థాపించి దానికి మేనేజింగ్ డైరెక్టర్ గా వ్యవహరిస్తున్నారు 1951 అక్టోబరులో భాస్కర్ ప్రొడక్షన్స్ ఆరంభించి, నెప్ట్యూన్ స్టూడియోస్‌లో సాంఘికచిత్రం నిర్మిస్తున్నారు

## కృష్ణవేణి

విజయలక్ష్మివారి "పేరంటాలు" ప్రొడ్యూసరు జననం 1925 1934 లో సినిమారంగంలో ప్రవేశించి బాలనటులతో తీసిన "అనసూయ" చిత్రంలో ప్రధానపాత్ర ధరించారు తరువాత వరుసగా "కచదేవయాని", "తుకారాం" చిత్రాలలో నటించి శోభనాచల పిక్చర్సువారి తారగా "జీవన్‌జ్యోతి", "మహానంద", "కాళిదాసు", "దక్షయజ్ఞం", "భీష్మ", "గొల్లభామ", "మదాలస", చిత్రాలలో నటించారు తరువాత "ధర్మాంగద", "తిరుగుబాటు", "మనదేశం", "లక్ష్మమ్మ" చిత్రాలలోనూ, 1951 లో "పేరంటాలు" చిత్రంలోనూ నటించారు 1949 లో ఎం ఆర్ ఎ పిక్చర్స్, 1950 లో విజయలక్ష్మి పిక్చర్స్ సంస్థలు ప్రారంభించారు ప్రస్తుతం రెండు కొత్తచిత్రాలు తీయడానికి ఏర్పాట్లు చేస్తున్నారు



కె బి నాగభూషణం



కె భాస్కరరావు



బి వి రామానందం

## టి గోపీచంద్ బి ఎ, బి ఎల్

విజయలక్ష్మివారి "పేరంటాలు"కు డైరక్టరు జననం 1915 మొదటగా సారధివారి "రైతుబిడ్డకు" సంభాషణలు రాయటానికి, రామబ్రహ్మంగారికి అసిస్టెంటుగానూ ప్రవేశించారు "భూలోకం" సంభాషణలూ, "గృహప్రవేశం" స్క్రిప్టూ రాశారు "లక్ష్మమ్మ", "పేరంటాలు" చిత్రాలకు స్క్రిప్టు రాసి డైరక్షను నిర్వహించారు ప్రస్తుతం "ప్రియురాలు", "పాలేరు" చిత్రాలకు స్క్రిప్టూ, డైరక్షనూ నిర్వహిస్తున్నారు



గోపీచందు



డి ఎల్ నారాయణ-వినోదా నిర్వాహకుడు



## పి. శ్రీధర్

అశ్వనీవారి 'మాయలమారి'కి డైరెక్టరు. స్వాతీవారి 'రూపవతి'కి కామెరామన్.

జననం 1916. సౌండు రికార్డింగు అసిస్టెంటుగా 1934లో సెల్ పిక్చర్స్‌లో ప్రవేశించి రెండేళ్లు పని చేశారు. 1936లో కామెరా డిపార్టుమెంటుకు మారి మరి రెండేళ్లు అప్రెంటిసుగా పని చేశారు. 1938 నుంచి అసిస్టెంట్ కామెరామాన్ పదవిపొంది రెండేళ్లు పని చేశారు. 1940 నుంచి కామెరామాన్‌గా స్వతంత్రంగా పని చేస్తున్నారు. 'మాతృభూమి' 'అపూర్వ సహోదర్' 'తిరుమంగయాళ్వార్' 'తెనాలిరామకృష్ణ' చిత్రాలకు కామెరామన్. 1942లో సెల్ పిక్చర్స్ వదలి ప్రతిభ పిక్చర్స్‌లో చేరి 1950 దాకా వారి చిత్రాలన్నిటికీ కామెరామెన్‌గా పని చేశారు. 1951లో 'రూపవతి'కి కామెరామాన్‌గా పనిచేసి మొదటిసారిగా 'మాయలమారి'కి డైరెక్టర్ పని తీసుకున్నారు. ప్రస్తుతం నవయుగ వారి 'జ్యోతి'కి డైరెక్టరుగానూ, ఎం. ఆర్. ఏ. పిక్చర్స్‌వారి కొత్త చిత్రానికి డైరెక్టర్ కామెరామాన్‌గానూ, జంపనవారి 'హేమరెడ్డి మల్లమ్మ'కు డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీగానూ పనిచేయబోతున్నారు.

## కె. ప్రభాకర్

స్వాతీవారి 'రూపవతి'కి ప్రొడ్యూసరు, డైరెక్టరు. 'సౌదామిని', 'గుణసుందరి' చిత్రాలలో నటించారు.

జననం 1916. 1946లో ప్రభాకర్ ప్రొడక్షన్స్ స్థాపించి సినిమారంగంలో ప్రవేశించి నటుడుగా, డైరెక్టరుగా, ప్రొడ్యూసరుగా 'మంగళసూత్రం' తయారు చేశారు. తరువాత 'ద్రోహి', 'శ్రీలక్ష్మమ్మ కథ' లలో నటించారు. 1951లో స్వాతీ సంస్థ స్థాపించి 'రూపవతి' తయారుచేశారు. ప్రస్తుతం నవయుగవారి 'జ్యోతి', జయాపావారి 'ఆశ' శోభనాచలవారి 'సావాసం' చిత్రాలలో నటిస్తూ, స్వాతీ సంస్థ తరఫున 'పగ' అన్న చిత్రం తయారుచేస్తున్నారు.



## వేదాంతం రాఘవయ్య

వినోదావారి 'స్త్రీసాహసం' ప్రొడ్యూసరు, డైరెక్టరు. 'మాయలమారి' 'తిరుగుబాటు' చిత్రాలకు డ్యాన్స్ డైరెక్టరు.

జననం 1919. డాన్స్ డైరెక్టరుగా 'మోహినీ రుక్మాంగద' చిత్రంతో సినిమారంగంలో ప్రవేశించారు. సారథివారి 'రైతుబిడ్డ' ప్రతిభావారి 'గరుడ గర్వభంగం' మొదలుకొని సుమారు 60 లేక 70 చిత్రాలకు డాన్స్ డైరెక్టరుగా పని చేశారు. వినోదా వారి సంస్థలో భాగస్వామి, ప్రొడ్యూసరు, డైరెక్టరు. ప్రస్తుతం ఈ సంస్థ తరఫున 'శాంతి', 'దేవదాసు' చిత్రాలు తయారుచేస్తున్నారు.

## కె. యస్. ప్రకాశరావు

ప్రకాశ్ వారి 'దీక్ష'కు ప్రొడ్యూసరు, డైరెక్టరు.

జననం 1914. 1940లో నటుడుగానూ, రామబ్రహ్మంగారికి అసిస్టెంటుగానూ కస్తూరీ ఫిలిమ్స్‌వారి 'అపవాదు' చిత్రంతో సినిమారంగం ప్రవేశించారు. 1942లో సారథీవారి 'పత్ని'లో నాయకపాత్ర ధరించారు. కొన్ని ఏళ్లపాటు సారథీ సంస్థలో బోర్డాఫ్ డైరెక్టర్స్‌లో సభ్యుడు. సారథివారి 'గృహప్రవేశం' నిర్మాణంతో సంబంధం ఉన్నది. స్వతంత్రా సంస్థకు మేనేజింగ్ డైరెక్టరుగా ఉంటూ 'ద్రోహి' చిత్రం తయారుచేశారు. 1949లో



స్వంతాన ప్రకాశ్ ప్రొడక్షన్స్ స్థాపించి 'మొదటిరాత్రి'(1950) 'దీక్ష'(1951) నిర్మించారు ఇటీవల 'ప్రకాశ్' స్టూడియోస్ నిర్మించి ప్రస్తుతం 'కన్నతల్లి' రెండు భాషలలో తయారు చేస్తున్నారు

## కురుమద్దాలి సీతారామచంద్రరావు

జ్వాలాంబికావారి 'మంత్రదండం'కు డైరక్టరు

జననం 1907 1931లో నటుడుగా 'లవకుశ'లో సినిమా రంగం ప్రవేశించారు తరువాత 'భక్త కుచేల'లో కుచేల పాత్ర ధరించారు 'దశావతారాలు'లో అసోసియేటెడ్ డైరక్టరు అయినారు తరువాత 'వరవిక్రయం', 'గొల్లభామ', 'పరమానందయ్య శిష్యులు' చిత్రాలకు అసోసియేట్ డైరక్టరుగా పని చేశారు ప్రస్తుతం అజంతావారి 'వయారిభామ'లోనూ, గజానన పిక్చర్సు వారి నూతన సాంఘిక చిత్రంలోనూ పని చేస్తున్నారు

## ఆర్ ప్రకాశ్

ప్రకాశ్ శంకర్ వారి 'మాయపిల్ల'కు ప్రొడ్యూసరు, డైరక్టరు

జననం 1901 1919లో తొలిసినిమా అనుభవం లండన్ లోనూ, తరువాత హాలీవుడ్‌లోనూ సుమారు 200 సైలెంటు చిత్రాలు తీశారు తొలిటాకీచిత్రం 'కల్లి'(తమిళం) ఇంపీరియల్ (బొంబాయి) స్టూడియోలో తయారుచేశారు మొత్తం 27 తమిళ టాకీలూ, 4 తెలుగు టాకీలు తయారుచేశారు ప్రస్తుతం 'సోదరి' అన్న చిత్రం తెలుగు, తమిళభాషలలో శ్యామలా స్టూడియోస్‌లో నిర్మిస్తున్నారు

## ఎస్ శంకరరెడ్డి

ప్రకాశ్ శంకర్ వారి 'మాయపిల్ల'కు ప్రొడ్యూసరు

జననం 1927 మహాత్మా పిక్చర్సు అనే టూరింగ్ సినిమాతో ఎగ్జిబిటరుగానూ, డిస్ట్రిబ్యూటరుగానూ సినిమా రంగంలో ప్రవేశించారు మెర్క్యురీ పిక్చర్స్ సంస్థలోనూ కొద్దికాలం విజయావారి 'పాతాళ'... 'పాపుకారు' చిత్రానికి అసిస్టెంటు డైరక్టరుగా పని చేసి అనుభవం గడించారు



## బి యన్ రెడ్డి

వాహినీవారి 'మల్లీశ్వరి' ప్రొడ్యూసరు, డైరక్టరు, రచయిత

జననం 1908 1937లో రోహిణీ పిక్చర్సులో 'గృహలక్ష్మి' తయారయే కాలంలో భాగస్వామిగా సినిమా రంగంలో ప్రవేశించారు 1938లో వాహినీ పిక్చర్స్ స్థాపించి దానికి మేనేజింగ్ డైరక్టరుగా ఉంటూ, 'వందేమాతరం' చిత్రానికి కథ రాసి, దానికి ప్రొడ్యూసరుగా, డైరక్టరుగా పని చేశారు తరువాత 'సుమంగళి' (1940), 'దేవత' (1941), 'స్వర్గసీమ' (1945), 1943లో వాహినీ ప్రొడక్షన్స్ ప్రారంభించారు 1946 డిసెంబరు లగాయతు 1948 మార్చివరకు వాహినీ స్టూడియో నిర్మాణంలో కృషి చేశారు 1951లో బి యన్ ప్రొడక్షన్స్ ప్రారంభించారు

విజయ వారి

# పెళ్ళిచేసి చూడు

డైరెక్టర్
ప్రసాద్





నిర్మాతలు... నాగిరెడ్డి - చక్రపాణి

# నటీనటులు

## అంజలీదేవి

1951 లో నటించిన చిత్రాలు 'నిర్దోషి', 'మాయలమారి', 'స్త్రీసాహసం', 'తిలోత్తమ', 'సర్వాధికారి'

జననం 1927 సినిమారంగంలో ప్రవేశం 1946 లో 'గొల్లభామ' లో తరువాత ఈమె వరుసగా 'బాలరాజు', 'మదాలస', 'కీలుగుర్రం', 'రక్తరేఖ', 'పల్లెటూరిపిల్ల', 'శ్రీలక్ష్మమ్మకథ', 'స్వప్నసుందరి', 'మాయారంభ' చిత్రాలలో నటించారు ఇవిగాక తమిళ చిత్రాలలోనూ, తెలుగుచిత్రాల తాలూకు తమిళ అనువాదాలలోనూ నటించారు 'మాయలమారి' తీసిన అశ్వనీ సంస్థలో భాగస్తురాలు ఈయేడు ఈమె అంజలీపిక్చర్స్ ప్రారంభించి, 'పరదేశి' చిత్రం నిర్మిస్తున్నారు ఇదికాక శ్రీ రాజరాజేశ్వరివారి 'పేదరైతు' లోనూ, జూపిటర్ వారి చిత్రాలలోనూ నటిస్తున్నారు

## అక్కినేని నాగేశ్వరరావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'తిలోత్తమ', 'సౌదామిని', 'స్త్రీసాహసం', 'మాయలమారి', 'మంత్రదండం'

జననం 1924 సినిమారంగంలో ప్రవేశం ప్రతిభావారి 'సీతారామజననం'లో తరువాత వరసగా 'ముగ్గురు మరాఠీలు', 'పల్నాటి యుద్ధం', 'బాలరాజు', 'కీలుగుర్రం', పల్లెటూరిపిల్ల', 'రక్తరేఖ', 'లైలామజ్నూ', 'స్వప్నసుందరి', 'పరమానందయ్య శిష్యులు', 'శ్రీలక్ష్మమ్మకథ', సంసారం' అశ్వనీ పిక్చర్సు నిర్మాతలలో ఈయనకూడా ఒకరు ప్రస్తుతం ఈయన అంజలీ పిక్చర్స్‌వారి 'పరదేశి', భరణీవారి 'ప్రేమ', వినోదావారి 'దేవదాసు', అజంతావారి 'వయారిభామ', ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారు తెలుగు, తమిళ, హిందీ భాషలలో తీయనున్న చిత్రం, భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి తొలిచిత్రం, అన్నపూర్ణా పిక్చర్స్, మనోహరా పిక్చర్స్‌వారి చిత్రాలలో నటిస్తున్నారు

## భానుమతి

1951లో ఈమె నటించిన చిత్రాలు 'మంగళ', 'మల్లీశ్వరి'

జననం 1924 సినిమారంగంలో ప్రవేశం 1939 లో 'వరవిక్రయం' లో ఇప్పటివరకు 22 చిత్రాలలో నటించారు భరణీ పిక్చర్స్ ఈమె స్వంత సంస్థ జెమినీవారి హిందీచిత్రం 'నిషాన్'లో నటించిన ఫలితంగా ఈమెకు బాంబేటాకీస్ వారి 'షంషేర్' చిత్రంలో నటించే అవకాశం లభించింది ప్రస్తుతం తన స్వంత చిత్రం 'ప్రేమ' లోనూ, జూపిటర్ వారి చిత్రాలలోనూ నటిస్తున్నారు భరణీపిక్చర్స్ తరఫున 'చాందీరాణి', 'శశిరేఖ' అనే చిత్రాలకు డైరక్టు చేయబోతున్నారు 1949, 50 సంవత్సరాల సినీఫాన్స్ బాలట్‌లో ఈమె ఉత్తమ నటిగా ఎన్నికోబడ్డారు

## ఎన్. టి. రామారావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు. 'పాతాళభైరవి', 'మల్లీశ్వరి'

జననం 1928 సినిమాలలో తొలి ప్రవేశం 1948 లో 'మనదేశం', పల్లెటూరిపిల్ల' చిత్రాలలో. తరువాత 'మాయారంభ', 'షావుకారు', 'సంసారం' చిత్రాలలో నటించారు 1950 నుంచి విజయా ప్రొడక్షన్స్‌వారి పర్మనెంటు ఆర్టిస్టుగా ఉన్నారు ప్రస్తుతం ఈయన నటిస్తున్న చిత్రాలు: విజయావారి 'పెళ్ళిచేసి చూడు', 'చంద్రహారం', రాజ్యంపిక్చర్స్‌వారి 'దాసి', పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'పల్లెటూరు'

## పసుపులేటి కన్నాంబ

19 1 లో ఈమె నటించిన చిత్రం 'సౌదామిని' మొదటిసారి సినిమారంగంలో ప్రవేశం స్టార్ కంబైన్స్‌వారి 'హరిశ్చంద్ర' లో తరువాత వరుసగా 'ద్రౌపదీ వస్త్రాపహరణం', 'కనకతార', 'గృహలక్ష్మి', 'చండిక', 'భోజకాళిదాసు', 'తల్లిప్రేమ', 'సుమతి', 'పాదుకాపట్టాభిషేకం', 'ముగ్గురుమరాఠీలు', 'మాయామచ్ఛీంద్ర', 'మాయలోకం', 'పల్నాటియుద్ధం'. ఈమె నటించిన తమిళచిత్రాలు ఏడెనిమిది ఉన్నాయి శ్రీ రాజరాజేశ్వరీ సంస్థ ఈమె స్వంతం, 1940 లో స్థాపించబడింది ప్రస్తుతం 'పేదరైతు' అన్న స్వంతచిత్రంలో నటిస్తున్నారు

## నారాయణరావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు• 'పేరంటాలు', 'ఆడజన్మ'

జననం 1915 1940 లో శోభనాచలవారి 'జీవనజ్యోతి'లో సినిమారంగ ప్రవేశం తరువాత 'దేవత', 'ప్రహ్లాద', 'దినబంధు', 'గౌంమలక్ష్మి', 'తాసిల్దారు', 'స్వర్గసీమ', 'ముగ్గురు మరాఠీలు', 'మనదేశం', 'లక్ష్మమ్మ', 'తిరుగుబాటు', 'మొదటిరాత్రి', 'జీవితం'లలో నటించారు ప్రస్తుతం సర్వోదయావారి 'మానవతి', వరుణావారి 'మంజరి', జంపనవారి 'మేనరికం', జయాషావారి 'ఆశ', బొంబాయి జాగృతీస్టూడియోస్ వారి 'కాపరం' చిత్రాలలో నటిస్తున్నార

## మాలతి

1951 లో ఈమె నటించిన చిత్రాలు 'అగ్నిపరీక్ష', 'పాతాళభైరవి'

జననం 1927 సినిమారంగంలో తొలిప్రవేశం 'ఉష' చిత్రంలో తరువాత వాహినీవారి 'సుమంగళి', 'పోతన', 'గుణసుందరి కథ'లలోనూ, రేణుకావారి 'భాగ్యలక్ష్మి'లలోనూ, స్టార్ కంబైన్స్‌వారి 'మాయామచ్ఛీంద్ర'లోనూ, మరి కొన్ని తమిళ చిత్రాలలోనూ నటించార వాహినీవారు తయారుచేయనున్న సాంఘికచిత్రం 'పెద్దమనుషులు'లో నటించబోతున్నారు

## ముక్కామల కృష్ణమూర్తి బి. ఏ.

1951 లో ఈయన నటించిన చిత్రలు: 'నిర్దోషి', 'మాయలమారి', 'పేరంటాలు'

జననం 1920 సినిమారంగంలో ప్రవేశం స్టార్ కంబైన్స్ వారి 'మాయామచ్ఛీంద్ర'లో తరువాత భరణీవారి 'లైలామజ్నూ', ప్రతిభావారి 'స్వప్నసుందరి', పద్మనాభన్ గారి 'అదృష్టదీపుడు' చిత్రాలలో నటించారు 1951 లో ఎం కే ఎం. ప్రొడక్షన్స్ ప్రారంభించి 'మరదలు పెళ్లి' తీస్తున్నారు సర్వోదయావారి 'మానవతి', భరణీవారి 'ప్రేమ', రాగిణీవారి అయిదవ చిత్రంలో నటిస్తున్నారు

## ఎస్ వి రంగారావు

1951 లో ఈయన నటించిన చిత్రం: 'పాతాళ భైరవి'

జననం 1918 సినిమారంగంలో ప్రవేశం 1945 లో 'వరూథిని'లో తరువాత నటించిన చిత్రాలు: 'పల్లెటూరిపిల్ల' (1948), 'షావుకారు' (1950) 1950 నుంచి విజయావారి పర్మనెంట్ ఆర్టిస్ట్ ప్రస్తుతం విజయావారి 'పెళ్లి చేసి చూడు', 'చంద్రహారం', రాజ్యం పిక్చర్స్‌వారి 'దాసి', అంజలి పిక్చర్స్‌వారి 'పరదేశి', పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'పల్లెటూరు' చిత్రాలలో నటిస్తున్నారు

## ఎస్ వరలక్ష్మి

1951 లో ఈమె నటించిన చిత్రం 'సౌదామిని'

జననం 1927 తొలిచిత్రం 'బాలయోగిని' అనేక తెలుగు, తమిళ చిత్రాలలో నటించారు ప్రస్తుతం అజంతావారి 'వయారిభామ' లోనూ, యువావారి 'టింగ్ రంగా'లోనూ నటిస్తున్నారు

## జి వరలక్ష్మి

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'నిర్దోషి' 'దీక్ష'

సినిమారంగంలో ప్రవేశం 'బారిష్టరు పార్వతీశం'లో తరువాత 'ప్రహ్లాద', 'దక్షయజ్ఞం', 'ద్రోహి', 'వింధ్యరాణి', 'మొదటిరాత్రి', 'స్వప్నసుందరి' చిత్రాలలో నటించారు ప్రస్తుతం 'మానవతి', 'పెళ్లి చేసిచూడు', 'కన్నతల్లి'



ఎస్ వి రంగారావు

## ఉప్పులూరి వీరవెంకట ప్రభాకర రామశర్మ బి ఏ

1951 లో ఈయన నటించిన చిత్రాలు: 'నవ్వితే నవరత్నాలు', 'ఆడజన్మ'

సినిమారంగంలో తొలిప్రవేశం సౌందరరాజన్ అయ్యంగారి 'అదృష్టదీపుడు'లో ఇప్పుడీయన నటిస్తున్న చిత్రాలు: నసైటీవారి తొలిచిత్రం, వరుణావారి 'మంజరి', అవర్ ఇండియావారి 'అవర్ హోం,' మాడరన్ థియేటర్స్‌వారు తీస్తున్న తెలుగు చిత్రం

## జేతుమల్ల కృష్ణకుమారి

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'నవ్వితే నవరత్నాలు', 'మంత్రదండం'

జననం 1934 తొలిచిత్రం 'నవ్వితే నవరత్నాలు' ఇప్పుడీమె నటిస్తున్న చిత్రాలు 'ప్రియురాలు', 'ఆడబ్రతుకు' 'మరదలు పెళ్లి', 'చిన్నకోడలు', 'జ్యోతి', 'చిన్నమ్మకథ', 'అమ్మలక్కలు', సౌందర్యా ఎక్చర్స్‌వారి కొత్తచిత్రం, ప్రసాద్ ఆర్ట్ వారి తొలిచిత్రం, జాగృతీ స్టూడియోస్ వారి 'కాపరం' ఇంకా ఇతరభాషా చిత్రాలలో కూడా పనిచేస్తున్నారు

## శ్రీరంజని (జూనియర్)

1951 ఈమె నటించిన చిత్రం 'మంత్రదండం'

జననం 1927 1935 లో బాలతారగా సినిమా రంగంలో ప్రవేశించి 'సతీతులసి', 'మార్కండేయ', 'నరనారాయణ' చిత్రాలలో నటించారు తరువాత తిరిగి 1944 లో ప్రౌఢతారగా 'భీష్మ' లోనూ, అనంతరం 'మదాలస', 'బ్రహ్మరథం', 'గృహప్రవేశం', 'గుణసుందరి', 'శైలామజ్నూ' చిత్రాలలోనూ నటించారు ప్రస్తుతం సర్వోదయావారి 'మానవతి', విజయావారి 'చంద్రహారం', పద్మనాభన్ గారి 'రాజేశ్వరి', చమ్రియావారి కొత్తసాంఘిక చిత్రం, భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి తొలిచిత్రం, ధరణీవారి 'ప్రేమ' చిత్రాలలో నటిస్తున్నారు



## ముదిగొండ లింగమూర్తి

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'మంత్రదండం', 'పేరంటాలు', 'ఆడజన్మ'

జననం 1908 కోయంబత్తూర్ సెంట్రల్ స్టూడియోస్ వారి 'తుకారాం' లో సినిమారంగంలో నటుడుగా ప్రవేశించి వాహినీ వారి 'వందేమాతరం' 'సుమంగళి', 'దేవత', 'పోతన', 'స్వర్గసీమ', 'వేమన' చిత్రాలలోనూ, 'పంతులమ్మ', 'భక్తిమాల', 'పల్నాటియుద్ధం', 'నారదనారది' 'త్యాగయ్య', 'ధర్మాంగద', 'లక్ష్మమ్మ' చిత్రాలలో నటించారు

ఇప్పుడు రాగిణీవారి రేవు చిత్రంలోనూ, శ్రీ రాజరాజేశ్వరీ వారి 'పెదరైతు' చిత్రంలోనూ, అవర్ ఇండియా ఫిలిమ్స్‌వారి 'అవర్ హోం' లోనూ నటిస్తున్నారు

## కాంచన

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'చంద్రవంక', 'మాయపిల్ల'

జననం 1926 సినిమాలలో ప్రవేశం 'మనదేశం' చిత్రంలో ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు సొసైటీ పిక్చర్స్‌వారి ప్రథమ చిత్రం, నాగూర్ గారి 'సందేహం'

## లక్ష్మీకాంత

1951 లో ఈమె నటించి నర్తించిన చిత్రాలు: 'అగ్నిపరీక్ష' 'పాతాళభైరవి', 'నిర్దోషి', 'మాయలమారి', 'పేరంటాలు'

ఉదయశంకర్ గారి 'కల్పన' లో ఈమె సినిమారంగంలోకి నర్తకిగా ప్రవేశించారు తరువాత 'లక్ష్మమ్మ' 'మనదేశం' చిత్రాలలో నటించారు ప్రస్తుతం 'ప్రియురాలు', 'మరదలుపెళ్లి' చిత్రాలలో నటిస్తున్నారు

## వి సూర్యకాంతం

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'అగ్నిపరీక్ష', 'సౌదామిని', 'రూపవతి'

జననం 1926 సినిమాలలోకి ప్రవేశం 1945 లో నారద నారదిలో తరువాత 'గృహప్రవేశం', 'ధర్మాంగద', 'రత్నమాల', 'లైలామజ్నూ', 'మాయారంభ', 'సంసారం' చిత్రాలలో నటించారు

ఇప్పుడు విజయావారి 'పెళ్లిచేసిచూడు', 'చంద్రహారం', కృష్ణాపిక్చర్స్‌వారి 'అమ్మలక్కలు', రాజ్యం పిక్చర్స్‌వారి 'దాసి', భరణీవారి 'ప్రేమ', నవయుగవారి 'శాంతి', భాస్కర్ పిక్చర్స్‌వారి కొత్త పిక్చర్‌లో నటిస్తున్నారు

## వంగర వెంకటసుబ్బయ్య

1951 లో ఈయన నటించిన చిత్రాలు: 'ఆకాశరాజు', 'చంద్రవంక' 'నవ్వితే నవరత్నాలు', 'మల్లీశ్వరి'

జననం 1897 1937 లో 'విప్రనారాయణ' చిత్రంలో సినిమారంగం ప్రవేశించి 'బాలయోగిని', 'మాలపిల్ల', 'రైతుబిడ్డ', 'ఇల్లాలు' 'మీరాబాయి' 'పత్ని' 'పంతులమ్మ', 'తులసీదాసు' 'పల్నాటియుద్ధం', 'మనదేశం', 'షావుకారు', 'లక్ష్మమ్మ', 'రక్షరేఖ' చిత్రాలలో నటించారు

ప్రస్తుతం వరుణావారి 'మంజరి', రాగిణీవారి రేవు చిత్రం, పద్మనాభన్ గారి 'రాజేశ్వరి' ఎం కే ఎం వారి 'మరదలుపెళ్లి', ప్రతిభావారి 'చిన్నకోడలు', అజంతావారి 'వయ్యారిభామ', టి కె ప్రొడక్షన్స్‌వారి 'పాలేరు' చిత్రాలలో నటించారు



కాంచన

రేలంగి వెంకట్రామయ్య



## టి జి కమలాదేవి

1951 లో ఈమె నటించిన చిత్రాలు 'చంద్రవంక', 'పాతాళభైరవి', 'మల్లీశ్వరి'

జననం 1928 తొలిచిత్రం 'తెనాలి రామకృష్ణ' సుమారు 15 చిత్రాలలో నటించి పాటలు పాడారు ప్లేబాక్ పాటలుకూడా పాడారు ఇప్పుడు పీపుల్స్ ఆర్ట్ వారి 'పల్లెటూరు' లోనూ, నాగూర్ గారి 'సం జే పి' లోనూ బుక్ అయి ఉన్నారు.

## రేలంగి వెంకట్రామయ్య

1951 లో ఈయన నవ్వించినచిత్రాలు: 'సౌదామిని' 'అగ్నిపరీక్ష', 'పాతాళభైరవి', 'స్త్రీసాహసం', 'పేరంటాలు',

జననం 1910— అయితేఆశ్చర్యంలేదు మొట్టమొదట సినిమారంగంలోకి తొంగి చూసింది 'తులాభారం'లో 1935 లో అప్పట్నుంచీ మొత్తంమీద ఏదో ఒక పిక్చర్లో నటిస్తూనే వస్తున్నారు

ప్రస్తుతం రాగిణీవారి రెండవ చిత్రంలో, భారత లక్ష్మీవారి 'ప్రియురాలు'లో, సర్వోదయావారి 'మానవతి'లో, పద్మశ్రీవారి 'రాజేశ్వరి'లో, ధరణీవారి 'ప్రేమ'లో, విజయావారి 'చంద్రహారం' లో, అంజలీపిక్చర్స్ 'పరదేశి' లో, రాజ్యంవారి 'దాసి' లో, యువా వారి 'టింగ్‌రంగా'లో, భాస్కర్ వారి కొత్త పిక్చర్ లో వేషం కడుతున్నార

## దాసరి గిరిజ

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'పాతాళభైరవి', 'స్త్రీసాహసం', 'ఆడజన్మ'

జననం 1935. ఈమె నటించిన మొదటి చిత్రాలు 'పరమానందయ్య శిష్యులు', 'అదృష్టదీపుడు'

ప్రస్తుతం రాగిణీవారి రెండవ చిత్రంలోనూ, అసర్ ఇండియా వారి 'అసర్ భగో'లోనూ, జూపిటర్ వారు తెలుగు, తమిళ, హిందీభాషలలో తీస్తున్న 'మనోహరి' చిత్రంలోనూ నటిస్తున్నారు.

## బసవరాజు పద్మనాభం

1951 లో ఈయన నటించిన చిత్రం: 'పాతాళ భైరవి'

జననం 1931 మొదట నటించిన చిత్రం 'మాయాలోకం' తరువాత 'ముగ్గురు మరాఠీలు', 'వింధ్యరాణి', 'రాధిక', 'భక్త శ్రియాళ', 'యోగివేమన', 'షావుకారు' చిత్రాలలో నటించారు విజయావారి పర్మనెంట్ ఆర్టిస్ట్

ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు: విజయావారి 'పెళ్లిచేసి చూడు', 'చంద్రహారం'

## వి బాలకృష్ణ

1951 లో ఈయన నటించిన చిత్రం: 'పాతాళభైరవి'

జననం 1922. మొదటి చిత్రం 'తెనాలి రామకృష్ణ' తరువాత 'చంద్రహాస', 'నారదనారది', 'రాధిక', 'ద్రోహి' చిత్రాలలో నటించారు విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టు

ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు విజయావారి 'పెళ్లిచేసి చూడు', 'చంద్రహారం' వాహినివారి 'పెద్దమనుషులు'

## మహంకాళి వెంకయ్య

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'నిర్దోషి', 'పాతాళభైరవి', 'మల్లీశ్వరి' [తరువాయి 51 వ పేజీలో]




వివరములకు: శుభోదయ ఫిలిమ్స్,
9, సాదులావీధి, మద్రాసు 17

జననం 1919 వింధ్యరాణి చిత్రంతో సినిమారంగంలో ప్రవేశించి, తరువాత అదృష్టదీపుడులో కూడా నటించారు ప్రస్తుతం నటించే చిత్రం విజయావారి 'పెళ్లిచేసిచూడు' విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టు

## సావిత్రి

1951 లో నటించి, నృత్యంచేసిన చిత్రాలు 'పాతాళభైరవి', 'రూపవతి'

జననం 1937 ఈమె నటించిన మొదటిచిత్రం 'సంసారం'

ప్రస్తుతం ఈమె నటించే చిత్రాలు: విజయావారి 'పెళ్లిచేసిచూడు', భారతలక్ష్మీవారి 'ప్రియురాలు', శుభోదయావారి 'ఆదర్శం', జంపనవారి 'మేనరికం' (ప్రధానపాత్ర) చమ్రియావారి కొత్తచిత్రం, వినోదావారి 'శాంతి' విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టు

## మాస్టర్ కుందు

1951 లో నటించిన చిత్రం 'దీక్ష'

జననం 1938

ఇప్పుడు నటించే చిత్రాలు విజయావారి 'పెళ్లిచేసిచూడు', వినోదావారి 'శాంతి', 'దేవదాసు'

## కస్తూరి శివరావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు: 'అగ్నిపరీక్ష', 'మాయలమారి', 'స్త్రీసాహసం', 'మాయపిల్ల', 'మంత్రదండం', 'రూపవతి'

జననం 1913 సినిమా రంగంలో ప్రవేశం 'భక్తమార్కండేయ' అనే సైలెంటుచిత్రంలో (1922) నటుడుగా మొదటి టాకీ 'చింతామణి' (1932) ఈయన నటించిన తెలుగుచిత్రాలు 80 కి పైగా ఉంటాయి ఆపరేటర్ పనినుంచి డిస్ట్రిబ్యూటరు పనిదాకా తెలుసును 1943 లో ఎలైడ్ పిక్చర్స్ కార్పొరేషన్ అనే డిస్ట్రిబ్యూషన్ సంస్థ సాగించారు 1949 లో ఎలైడ్ పిక్చర్స్ అనే చిత్ర నిర్మాణసంస్థ స్థాపించి 'పరమానందయ్య శిష్యులు' తయారు చేశారు ఇప్పు డొక స్టంట్ పిక్చర్ 'శేగార్ఫు రాజులు' తీయటానికి యత్నిస్తున్నారు

ప్రస్తుతం ఈయన పనిచేస్తున్న చిత్రాలు 'మానవతి', 'ప్రేమ' 'జ్యోతి', 'మేనరికం', 'కన్నతల్లి', వినోదావారి చిత్రాలు, చమ్రియావారి చిత్రం

## రాజకుమారి

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'ఆకాశరాజు', 'మాయపిల్ల', 'మల్లీశ్వరి'

జననం 1924 సినిమాలలో ప్రవేశం 1937 లో 'దశావతారాలు'లో 'అమ్మ', 'ఉష', 'సుమంగళి', 'దేవత', 'ముగ్గురు మరాఠీలు' చిత్రాలలో నటించారు

ప్రస్తుతం ప్రతిభావారి 'చిన్నకోడలు'లో, ప్రకాశ్ శంకర్ వారి 'భలేమొగుడు'లో నటించుతున్నారు

## టి కనకం

1951 లో ఈమె నటించిన చిత్రాలు: 'చంద్రవంక', 'ఆకాశరాజు', 'అగ్నిపరీక్ష', 'సౌదామిని', 'మాయపిల్ల'

జననం 1926 లో తొలిచిత్రం 'గృహప్రవేశం' (1946) తరువాత 'కీలుగుర్రం', 'గుణసుందరి', 'షావుకారు', 'పల్లెటూరిపిల్ల', 'రక్తరేఖ' చిత్రాలలో నటించారు

1951 లో స్వంతంగా చేతనా ఆర్టు ప్రొడక్షన్స్ ప్రారంభించి 'దేశదిమ్మరి' తయారు చేస్తున్నారు.

ఈమె ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు 'టింగ్ రంగా', 'ప్రియురాలు', 'ఆడబ్రతుకు', 'సావాసం', 'మానవతి', 'పాలేరు', 'రాజేశ్వరి', 'దాసి'



కోటపల్లి (నల్ల) రామ్మూర్తి



సూర్యప్రభ

## కోటపల్లి (నల్ల) రామ్మూర్తి

1951 లో ఈయన నటించిన చిత్రాలు: 'చంద్రవంక', 'అగ్నిపరీక్ష', 'మంత్రదండం', 'స్త్రీసాహసం', 'పేరంటాలు'

జననం 1917 సినిమారంగంలో ప్రవేశం 'గొల్లభామ', 'రాధిక' చిత్రాలలో తరువాత 'కీలుగుర్రం', 'మదాలస', 'పల్లెటూరిపిల్ల', 'పరమానందయ్య శిష్యులు' చిత్రాలలో నటించారు

ఇప్పుడు యువావారి 'టింగ్ రంగా', రాగిణీవారి క్రొత్త చిత్రం, ఏ యన్ ప్రొడక్షన్సువారి 'ఆడబ్రతుకు', సౌసైటీవారి తొలిచిత్రం, భారతలక్ష్మీవారి 'ప్రియురాలు', టి ఆర్ ప్రొడక్షన్సువారి 'పాలేరు', అంజలీ పిక్చర్సువారి 'పరదేశి', వాహినీవారి 'పెద్దమనుషులు' చిత్రాలలో నటిస్తున్నారు

## సూర్యప్రభ

1951 లో ఈమె నటించిన చిత్రాలు 'మంగళ', 'తిలోత్తమ', 'స్త్రీసాహసం', 'రూపవతి'

జననం 1930 సినిమా రంగంలో ప్రవేశం జెమినీవారి 'మిస్ మాలిని' లో తరువాత నటించిన చిత్రాలు 'చక్రధారి' (తమిళం), అపూర్వసహోదరులు, శ్రీలక్ష్మమ్మకథ, లావణ్య (తమిళ చిత్రంలో నాయికపాత్ర)

ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు జెమినీవారి కొత్తచిత్రం, వినోదావారి 'దేవదాసు'



## జి ఎన్ స్వామి

1951 లో ఈయన నటించిన చిత్రం 'రూపవతి'

జననం 1923 సినిమాలలో తొలిప్రవేశం 1935 లో 'భక్తధ్రువ'లో తరువాత నటించిన చిత్రాలు 'దశావతారాలు', 'భక్తమార్కండేయ', 'చంద్రహాస'

ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు ప్రతిభావారి 'చిన్నకోడలు' జయాషావారి 'ఆశ', అరుణావారి 'జై వీరభేతాళ', సౌందర్య పిక్చర్సువారి 'ప్రేమజలం', గజానన ప్రొడక్షన్సువారి కొత్త చిత్రం



## తిక్కవరపు వెంకటరమణారెడ్డి

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'దీక్ష' 'ఆడజన్మ'

జననం 1921

ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు: 'రూపవతి', 'పాలేరు', 'మంజరి', 'పల్లెటూరు' 'దేశిగిమ్మరి'

## రావి కామేశ్వరరావు

1951 లో ఈయన నటించిన చిత్రం: 'ఆకాశరాజు', 'జీవితనౌక', 'పెళ్లికూతురు' చిత్రాలలో తెలుగు సంభాషణలు 'డబ్' చేశారు

జననం 1918

జగతీ పిక్చర్సువారి 'ఇంటిగుట్టు' లో నటిస్తున్నారు

## పువ్వుల సూరిబాబు

'51 లో ఈయన నటించిన చిత్రాలు 'సౌదామిని', 'మాయపిల్ల'

జననం 1914 1938 లో సినిమారంగంలో ప్రవేశించి వేల్ పిక్చర్సువారి 'సీతాకల్యాణం' లో నటించారు ఈయన నటించిన చిత్రాలు మొత్తం 18

ప్రస్తుతం 'టింగ్ రంగా'లో నటిస్తున్నారు

# ప్రతి 'తార' కు ఉండదగిన కారు

ఫిలిం రంగంలోని నటీనటులకు, టెక్నీషియనులకు, డైరెక్టర్లకు, ప్రొడ్యూసర్లకు విజ్ఞప్తి! మారిస్ మైనర్ ను కలిగివున్నందుకు మీరు గర్వించవచ్చు మితవ్యయంతో అత్యద్భుతంగా పనిచేయుటకు ఇది ఖ్యాతి గాంచినది. ఈ చిన్నకారు నిజంగా ఎంతగొప్పదో మీకు మేము నిరూపించడానికి అవకాశం ఇస్తారా?

## మారిస్ మైనర్

## ఉజ్వల తారవంటి కారు




## అడిసన్ అండ్ కో, లిమిటెడ్,

మద్రాసు - బెంగుళూరు - కోయంబత్తూరు.

అమ్మునట్టి, సర్వీసుచేయునట్టి డీలర్లు జిల్లాలలో కలరు.

## చదలవాడ కుటుంబరావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'అగ్నిపరీక్ష' 'సౌదామిని', 'పాతాళభైరవి', 'దీక్ష'

జననం 1915 తొలిగా సినిమారంగ ప్రవేశం 1949 లో విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టుగా 'షావుకారు' 'అదృష్ట దీపుడు'లో నటించారు 'ఆహుతి', 'బీదలపాట్లు' చిత్రాలలో తెలుగుసంభాషణలు 'డబ్' చేశారు ఇప్పుడు 'పెళ్లిచేసిచూడు' 'రిక్షావాలా' 'వయ్యారిభామ', 'జ్యోతి', రాగిణీవారి క్రొత్త చిత్రం, భరణీవారి 'ప్రేమ' చిత్రములలో నటిస్తున్నారు

## దాసరి సాంబసదాశివరావు



1951 లో ఈయన నటించిన చిత్రాలు 'తిరుగుబాటు', 'సౌదామిని', 'స్త్రీసాహసం', 'దీక్ష'

జననం 1920 1940 లో 'దక్షయజ్ఞం'లో శివుడుగా సినిమారంగం ప్రవేశించారు ఇప్పటికి 22 చిత్రాలలో నటించారు

ప్రస్తుతం జూపిటర్‌వారి 'మనోహర'లోనూ, బి ఏ సుబ్బారావుగారు తీయనున్న 'రాజు-పేద'లోనూ చక్రవర్తి వారి క్రొత్తచిత్రంలోనూ నటించనున్నారు నిజమైన చిత్రాలకు భాగస్వామి, దర్శకుడు

## చిలకలపూడి సీతారామాంజనేయులు (సి యస్ ఆర్)

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'ఆకాశరాజు', 'పాతాళభైరవి', 'అగ్నిపరీక్ష', 'సౌదామిని', 'స్త్రీసాహసం', 'మంత్రదండం'



జననం 1907 1936 లో 'ద్రౌపదీ వస్త్రాపహరణం'లో కృష్ణుడుగా సినిమాలలో ప్రవేశం మొత్తం 27 చిత్రాలలో నాయకపాత్రలూ, దుష్టపాత్రలూ హాస్యపాత్రలూ ధరించారు ప్రస్తుతం దయానా పిక్చర్స్‌వారి 'రిక్షావాలా'లో ప్రధానపాత్ర ధరిస్తూ, డైరెక్టరుగా పనిచేస్తున్నారు

ఈయన ఇప్పుడు నటించే ఇతరచిత్రం అజంతావారి 'వయ్యారిభామ'

## అడ్డాల నారాయణరావు

1951 లో ఈయన నటించిన చిత్రాలు: 'నవ్వితే నవరత్నాలు', 'ఆదర్శం'

సినిమాలలో మొదటిసారి 'లవకుశ'లో బాలనటుడుగా ప్రవేశించారు తరువాత ఈయన నటించిన చిత్రాలు 'అనసూయ', 'కృష్ణవిజయం (సి పుల్లయ్యగారిది)', 'దశావతారాలు', 'వరవిక్రయం', 'బాలనాగమ్మ', 'జీవితం', 'పరమానందయ్య శిష్యులు', 'అదృష్టదీపుడు'

ప్రస్తుతం 'మైహోం', 'మరదలు పెళ్లి' మొదలైన చిత్రాలలో నటిస్తున్నారు



## కొమాండూరు దొరస్వామి అయ్యంగార్

1951 లో ఈయన నటించిన చిత్రాలు 'మంగళ', 'సౌదామిని', 'నిర్దోషి', 'ఆడజన్మ', 'మల్లీశ్వరి'

జననం 1897 1936 లో 'గృహలక్ష్మి'లో సినిమారంగం ప్రవేశించి అనేక తెలుగు, తమిళ చిత్రాలలో నటించారు

ప్రస్తుతం ఈయన నటిస్తున్న తెలుగు చిత్రాలు 'పెళ్లిచేసి చూడు' రాగిణీవారి 5 వ చిత్రం, 'మరదలు పెళ్ళి', 'ప్రేమ', 'పెదరైతు', 'దాసి' వగైరా

## మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

1951 లో ఈయన నటించిన చిత్రం 'దీక్ష'

జననం 1921

ప్రస్తుతం ఈయన నటించే చిత్రాలు 'జ్యోతి', 'పాలేరు', 'మేనరికం', 'పల్లెటూరు', 'కన్నతల్లి'

## భీమన సీతారాం

1951 లో నటించిన చిత్రాలు 'అగ్నిపరీక్ష', 'మాయలమారి' 'స్త్రీసాహసం'

సినిమారంగంలో ప్రవేశం 'కాళిదాసు' చిత్రంలో తరువాత 'మహానంద', 'సత్యమే జయం', 'తెనాలి రామకృష్ణ', 'మంగళసూత్రం', 'గృహప్రవేశం', 'పల్లెటూరి పిల్ల' వగైరా అనేక చిత్రాలలో నటించారు

ప్రస్తుతం 'టింగ్ రంగా' 'ఆడబ్రతుకు', 'పరదేశి', 'ప్రేమ', 'సావాసం', 'పాలేరు', 'దేశదిమ్మరి', 'సి ఐ డి', భాస్కర్ వారి తొలిచిత్రం వగైరాలలో నటిస్తున్నారు

## గుమ్మడి వెంకటేశ్వరరావు

1951 లో ఈయన చిత్రాలు: 'నవ్వితే నవరత్నాలు', 'పేరంటాలు'



జననం 1926 1950 లో 'అదృష్టదీపుడు' లో సినిమారంగ ప్రవేశం ప్రస్తుతం 'ప్రియురాలు', 'జై వీరబేతాళ్' చిత్రాలలో వేషాలు వేస్తున్నారు



మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి







(ఎగువ)
రామశర్మ బి ఎ, శ్రీరామమూర్తి



(పక్క)
మాష్టర్ కుందు





ఏ. యన్. ప్రొడక్షన్సు వారి

# ఆడబ్రతుకు



శ్రీరంజని కృష్ణకుమారి కనకం వి.వి.సుబ్బారావు.
రఘురామయ్య... కోటేశ్వరరావు రామమూర్తి....
సీతారాం.... ఎ.యల్.నారాయణ.... మల్లిక....

డైరెక్షన్... B.A.సుబ్బారావు
ప్రొడ్యూసర్...A.నరసయ్య
రచన... తాపీ • మ్యూజిక్ ఒగిరాల
నృత్యం... వెంపటి • ఆర్టు టి.వి.యస్.శర్మ
స్టూడియో... శోభనాచల

A.N.PRODUCTIONS, 12. WESTEND ST, MADRAS. 6.

# ★ సంగీతశాఖ ★

## మ్యూజిక్ డైరెక్టర్లు

### పెనుపాత్రుని ఆదినారాయణరావు

మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రాలు 'తిలోత్తమ', 'మాయలమారి'

జననం 1915

సినిమారంగప్రవేశం 1949 లో 'పల్లెటూరి పిల్ల'కు మ్యూజిక్ డైరెక్టరుగా

'మాయలమారి' తయారుచేసిన అశ్వినీపిక్చర్స్‌లో భాగస్వామి 1951 లో ప్రారంభించిన అంజలీ పిక్చర్స్‌లో భాగస్వామి ఈ సంస్థతరఫున తయారవుతున్న 'పరదేశి' చిత్రానికి ప్రొడ్యూసరు

### బాలాంత్రపు రజనీకాంతరావు బి. ఎ. (ఆనర్స్)



మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రం 'పేరంటాలు'

జననం 1920 గాయకుడుగా, సంగీతకారుడుగా సినిమాలలో ప్రవేశం 1941 లో జగన్నాథ్ ప్రొడక్షన్సువారి 'తారుమారు', 'భలే పెళ్లి' చిత్రాలలో తరువాత అప్పుడప్పుడూ రెండు మూడు చిత్రాలకు పాటలు రచించి సంగీతం కూర్చారు

ప్రస్తుతం సర్వోదయావారి 'మానవతి'కి పనిచేస్తున్నారు

### అద్దేపల్లి రామారావు

మ్యూజిక్ డైరెకర్ 1951 చిత్రాలు 'పేరంటాలు', 'ఖిల్లీశ్వరి', 'జీవితనౌక' (రీరికార్డింగ్ మాత్రం)

జననం 1914 వాహినీవారి 'సుమంగళి' చిత్రంలో అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టరుగా సినిమారంగంలో ప్రవేశించి మొత్తం 25 చిత్రాలకు పనిచేశారు

ఇప్పుడు 'ప్రియురాలు', 'మై హోం' చిత్రాలలో పని చేస్తున్నారు

### హెచ్ ఆర్ పద్మనాభశాస్త్రి

మ్యూజిక్ డైరెకరు 1951 చిత్రం 'నిర్దోషి'

జననం 1914 మ్యూజిక్ డైరెక్టరుగా సినిమారంగ ప్రవేశం 1931 లో సెలెక్టు పిక్చర్సువారి 'పాదుక' 'శకుంతల' చిత్రా



అలా ఇప్పటికి 12 తెలుగు చిత్రాలకు మ్యూజిక్ డైరెక్టరుగా పనిచేశారు

ప్రస్తుతం పనిచేస్తున్న చిత్రాలు 'మంజరి', 'మానవతి', 'పేదరైతు'

## గాలిపెంచల నరసింహారావు



మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రం 'అగ్నిపరీక్ష'

జననం 1903 మొట్టమొదటి చిత్రం వేల్‌పిక్చర్స్‌వారి 'సీతాకల్యాణం' అదిమొదలు తెలుగు తమిళ చిత్రాలన్నీ కలిపి దాదాపు 25 కు పనిచేశారు

ఇప్పుడు 'జైవీరబేతాళ్' చిత్రంలో పనిచేస్తున్నారు

## ఘంటసాల వెంకటేశ్వరరావు — సంగీత విద్వాన్

మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రం 'పాతాళభైరవి'

జననం 1923

1944 లో నటుడుగా 'సీతారామజననం'లో సినిమా రంగంలో అడుగుపెట్టారు 'స్వర్గసీమ' నుంచి ప్లేబాక్ పాడడం ఆరంభించారు 'త్యాగయ్య'లో నటిస్తూ పాడారు 'పల్నాటియుద్ధం', 'లైలామజ్నూ' చిత్రాలకు ప్లేబాక్ పాడారు 'రత్నమాల' చిత్రానికి అసిస్టెంట్ మ్యూజిక్ డైరెక్టరు 'బాలరాజు'కు అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టరు 'కీలుగుర్రం', 'మనదేశం', 'లక్ష్మమ్మ', 'షావుకారు' చిత్రాలకు మ్యూజిక్ డైరెక్టరు తెలుగు, తమిళ్, మళయాళ్, సింహళ్, హిందీభాషలలో సుమారు 50 చిత్రాలలో పాటలు పాడారు విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టు

ప్రస్తుతం విజయావారి 'పెళ్ళిచేసిచూడు', 'చంద్రహారం', పీపుల్స్ఆర్ట్‌వారి 'పల్లెటూరు' చిత్రాలకు మ్యూజిక్ డైరెక్టరు

## ఎస్ రాజేశ్వరరావు



మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రాలు 'మంత్రదండం', 'మల్లీశ్వరి'

జననం 1921 సినిమారంగ ప్రవేశం నటగాయకుడుగా వేల్ పిక్చర్స్‌వారి 'కృష్ణలీల'లో మ్యూజిక్ డైరెక్టరుగా పనిచేసిన మొదటిచిత్రం 'జయప్రద' (1939) తరువాత 'మాయల మరాఠీ', 'ఇల్లాలు' చిత్రాలలో పనిచేసి 1940 లో జెమినీసంస్థలో ప్రవేశించి 1950 దాకా అక్కడే పనిచేశారు

ఇప్పుడు 'ప్రియురాలు' చిత్రానికీ, మరిరెండు తమిళ చిత్రాలకూ పనిచేస్తున్నారు

## ఎం వేణు

సహాయ సంగీత దర్శకుడు 1951 చిత్రం 'పాతాళభైరవి'

జననం 1921 సినిమారంగ ప్రవేశం 1938 లో సారథీవారి 'మాలపిల్ల'లో 'మాలపిల్ల', 'రైతుబిడ్డ', 'అపవాదు', 'మీరాబాయి' చిత్రాలలో బి ఎన్ ఆర్ తో కలిసిపనిచేశారు తరువాత బొంబాయిలో శాంతారాంగారి 'మాలి' చిత్రంలోనూ, మద్రాసులో 'వాల్మీకి' చిత్రంలోనూ పనిచేశారు విజయాప్రొడక్షన్స్ ఆరంభమైనప్పటినుండి ఆర్కెస్ట్రా కండక్టరుగా పనిచేస్తున్నారు ఇదివరకు పనిచేసిన చిత్రం 'షావుకారు' ఇప్పుడు పనిచేస్తున్న చిత్రాలు 'పెళ్లిచేసిచూడు', 'చంద్రహారం'

## గుడిమెట్ల అశ్వత్థామ

మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రాలు : 'నవ్వితే నవరత్నాలు', 'నిర్దోషి' (రీరికార్డింగ్ మాత్రం),

జననం 1927 నటుడుగా 1949 లో 'దేవత'లో సినిమా రంగంలో ప్రవేశించి 'భాగ్యలక్ష్మి', 'గరుడగర్వభంగం', 'త్యాగయ్య' మరికొన్ని తమిళచిత్రాలలో నటించారు 1946 లో ఒక తమిళచిత్రానికి మ్యూజిక్ డైరెక్టరుగా మొదటిసారి పనిచేశారు 'బీదలపాట్లు' (1950) లో అసోసియేట్ గా పనిచేశారు



ప్రస్తుతం 'రిక్షావాలా' 'చిన్న కోడలు', ఛాయా వారి క్రొత్తచిత్రం 'ఆదర్శం' పృథ్వీ రోహిణీసంస్థల క్రొత్తచిత్రాలకూ మ్యూజిక్ డైరెక్షన్ నిర్వహిస్తున్నారు

## పెండ్యాల నాగేశ్వరరావు



మ్యూజిక్ డైరెక్టరు 9ం చిత్ర 'దీక్ష

జననం 1917 సినిమారంగ ప్రవేశం శ్రీ రాజరాజేశ్వరీవారి 'తల్లిప్రేమ చిత్రంలో సంగీత సహాయకుడుగా అలాగే 'సుమతి'కి కూడా పనిచేశారు 'గృహప్రవేశం లో అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టరు స్వతంత్రంగా సంగీతదర్శకత్వం చేసిన చిత్రం స్వతంత్రావారి 'ద్రోహి' ప్రకాశ్ వారి 'మొదటిరాత్రి కి మ్యూజిక్ డైరెక్టరు ప్రకాశ్ స్టూడియోలో పర్మనెంటుగా పని చేయబోతున్నారు

ఇప్పుడు పనిచేసే చిత్రాలు ప్రకాశ్ వారి 'కన్నతల్లి' నవయుగ 'జ్యోతి', టి క వారి 'పాలేరు', జంపనవారి 'మేన రికం, చేతనావారి 'దేశద్రిమ్మరి కస్తూరికళావారి 'దాంపత్యం ,

## సుసర్ల దక్షిణామూర్తి

మ్యూజిక్ డైరెక్టరు 1951 చిత్రాలు 'సర్వాధికారి', 'ఆడజన్మ'

జననం 1921 సినిమారంగంలో ప్రవేశం 'మీరాబాయి లో బి ఎన్ ఆర్ కు సహాయకుడుగా (1938) 'శారద సంసారం చిత్రానికి 1940 లో మొదటిసారిగా మ్యూజిక్ డైరెక్షన్ తరు వాత కొంతకాలం సుబ్బరామన్‌దగ్గర సహాయకుడుగా ఉండి 'పరమానందయ్య శిష్యులు 'సంసారం చిత్రాలకు మ్యూజిక్ డైరెకరుగా పనిచేశారు

ఇప్పుడు మాడరన్ థియేటర్సువారికి మ్యూజిక్ డైరెక్టరుగా పనిచేస్తున్నారు



మ్యూజిక్ డైరెక్టరు సి ఆర్ సుబ్బరామన్

# ప్లేబాక్ ఆర్టిస్టులు

జి కృష్ణవేణి (జిక్కి)





## ఎ లల

ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు 'పాతాళభైరవి', 'తిలోత్తమ', 'నవ్వితే నవరత్నాలు' 'అగ్నిపరీక్ష' 'ఆడజన్మ', 'సర్వాధికారి', 'జీవితనౌక' 'స్త్రీసాహసం' 'పెళ్లికూతురు'

జననం 1933 సినిమారంగంలో గాయకిగా తొలిప్రవేశం 'కంకణం' అన్న తమిళచిత్రంలో ఇప్పటికి 107 చిత్రాలలో, తమిళ తెలుగు మళయాళ కన్నడభాషలలో ప్లేబాక్ పాటలు పాడారు

ఇప్పుడు ఈమె పాడుతున్న తెలుగుచిత్రాలు 'జమీందార్', 'చంద్రహారం', 'ఆకలిమంటలు' 'అడ్రబతు', 'మంజరి' 'రాజేశ్వరి', 'చిన్నమ్మకథ', సొసైటీవారి కొత్త చిత్రం, 'సంక్రాంతి' 'చిన్నకోడలు'

## వక్కలంక సరళాదేవి

ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు 'సౌదామిని' 'నవ్వితే నవరత్నాలు' 'రూపవతి', 'దీక్ష'

జననం 1927 1946లో మొదటిసారిగా 'త్యాగయ్య' చిత్రంలో పాడారు తరువాత చాలా తెలుగుచిత్రాలలో ప్లేబాక్ పాడి 1950 నుంచి జెమినీసంస్థలో మ్యూజిక్ డైరెక్టర్‌లో సహాయకురాలుగా ఉన్నారు

ఇప్పుడు పనిచేస్తున్న చిత్రాలు ఎం కే ఎం వారి 'మరదలు పెళ్ళి' వగైరా

ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు 'చంద్రవంక' 'అగ్నిపరీక్ష' 'తిలోత్తమ' 'పాతాళభైరవి' 'సౌదామిని' 'మాయలమారి' 'రూపవతి', 'స్త్రీసాహసం' 'పెళ్లికూతురు', 'ఆడజన్మ' 'నిర్దోషి', 'పేరంటాలు' 'జీవితనౌక'

జననం 1935 సినిమారంగంలో నటిగా 'పంతులమ్మ'లో ప్రవేశించి 'గొల్లభామ', 'మంగళసూత్రం' చిత్రాలలో నటించారు తెలుగు, తమిళ, కన్నడ మళయాళ, హిందీ భాషలలో 50 చిత్రాలలో పాడారు

ఇప్పుడు పనిచేస్తున్న చిత్రాలు 'పెద్దరైతు' 'ప్రియురాలు' 'శకదిమ్మరి', 'మరదలు పెళ్లి', 'పరదేశి' 'రాజేశ్వరి', 'అవర్ హోం', సొసైటీవారి కొత్తచిత్రం 'టింగ్ రంగా', 'మానవతి', 'జ్యోతి', 'దాసి', 'దేవదాసు', ఫాస్కర్, రాగిణి చిత్రాలు

## ఎం సౌమిత్రి

ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు తిలోత్తమ మంగళ, మాయలమారి దీక్ష జీవితనౌక, పెళ్ళికూతురు, మల్లీశ్వరి

ఈయన పాడిన చిత్రాలూ, పాడుతున్నవీ కలిసి రమారమి 80 ఉంటాయి తయారులో ఉన్న ఈ క్రింది చిత్రాలలో పాడుతున్నారు మంజరి జ్యోతి వగైరా



భానుమతి
నాగేశ్వరరావు
శ్రీరంజని (జూ)
రేలంగి
శివరావు
సి యస్ ఆర్
&
ముక్కామల
నటించిన



భరణీ
వారి

# ప్రేమ

డైరెక్షన్ రామకృష్ణ



మ్యూజిక్ సుబ్బరామన్ ఫొటోగ్రఫ కమల్ ఘోష్
రచన గోపాలరాయశర్మ ఆర్టు కె నాగేశ్వరరావు

స్టూడియో
వాహిని

ఆంధ్ర, సీడెడ్, నైజాం
పూర్ణా పిక్చర్సు లిమిటెడ్,
విజయవాడ



మైసూరు స్టేట్, కూర్గు
డ్రీంలాండ్ పిక్చర్సు కార్పొరేషన్
బెంగుళూరు సిటీ

ఇతర వివరములకు భరణి పిక్చర్సు, మదరాసు-17



## మాధవపెద్ది సత్యనారాయణ

ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు 'సౌదామిని 'స్త్రీ సాహసం 'నవ్వితే నవరత్నాలు 'నిరోషి 'మల్లీశ్వరి 'పెళ్లి కూతురు ఆడజన్మ 'జీవితనౌక

జననం 1924 సినిమారంగంలో ప్రవేశం 1946 లో వై వి రావుగారి 'రామదాసు' (తమిళం (హిందీ) చిత్రంలో కబీరు పాత్రధారిగా ప్లేబాక్ పాడిన మొదటి తెలుగుచిత్రం ధరణీవారి 'లైలామజ్నూ తరువాత అనేకచిత్రాలలో ప్లేబాక్ పాటలుపాడి, కొన్నిచిత్రాలలో పాత్రధారణ కూడా చేశారు తెలుగు తమిళ చిత్రాలు 40 కి పాటలు పాడారు

ఇప్పుడు ప్లేబాక్ పాడే చిత్రాలు 'మానవతి 'రాజేశ్వరి', 'మంజరి', 'మనోహరా 'రిక్షావాలా 'దేవదాసు,' 'పాలేరు, 'విజయభాస్కరుడు, 'ప్రియురాలు 'సాహసం 'పేదరైతు 'అకలిమంటలు', 'జైవీరబేతాళ్, 'సి ఐ డి', 'చంద్రహారం', 'సంక్రాంతి

## పాతర్లగడ్డ నాగేశ్వరరావు



ప్లేబాక్ ఆర్టిస్టు 1951 చిత్రాలు 'మంగళ, 'తిలోత్తమ, 'చంద్రవంక, 'సౌదామిని, 'మాయలమారి 'దీక్ష 'పెళ్ళి కూతురు' 'పాతాళభైరవి', 'జీవితనౌక', 'మంత్రదండం' 'రూపవతి' 'ఆడజన్మ 'రాజేశ్వరి

జననం 1928 సినిమాలో ప్రవేశం 1945 లో 'మంగళ' సూత్రం లో తరువాత 'ప్రహ్లాటియుద్ధం 'ద్రోహి 'బాలరాజు చిత్రాలకు తెలుగుపాటలూ 'చంద్రలేఖ' 'నిషాన్ చిత్రాలకు హిందీపాటలూ పాడారు

ప్రస్తుతం ఈ క్రింది చిత్రాలలో పాటలు పాడుతున్నారు 'మనోహరా (హిందీ) 'పరదేశి', 'దాసి, 'రిక్షావాలా 'బాలసన్యాసమ్మ కథ, 'ప్రేమ' వగైరా

# టెక్నీషియన్లు

## కామెరామెన్

### మార్కస్ బార్ట్లే

కామెరామెన్ 1951 చిత్రం 'పాతాళభైరవి'

జననం 1917 1936 లో కె సుబ్రహ్మణ్యంగారి కొరకు కృష్ణక్ మధురంలతో 2 రీల్సు కామెడీ తీశారు నాటినుండి 17 చిత్రాలకు కామెరామన్‌గా పనిచేసి ఇప్పుడు 18 వది తీస్తున్నారు విజయావారి పర్మనెంట్ టెక్నీషియన్

ప్రస్తుతం విజయావారి పెళ్ళిచేసి చూడు, చంద్రహారం తీస్తున్నారు

### వి ఎస్ రంగా



కామెరామన్ 1951 చిత్రాలు మాయలమారి, స్త్రీ సాహసం

జననం 1918 1937 లో లాబొరేటరీ ఎప్రెంటిస్‌గా బొంబాయి రంజిత్ మూవీటోన్ కంపెనీలో ప్రవేశించారు 1938 లో కృష్ణగోపాల్ కింద కామెరాపని నేర్చుకో నారంభించారు 1941 46 దాకా జెమినీ స్టూడియోలో పనిచేశారు 1946 లో శాంతిటాకీస్‌లో తమిళభాషలో తీసిన భక్తతులసీదాస్ చిత్రానికి కామెరామన్‌గా డైరెక్టరుగా పనిచేశారు తరువాత లైలామజ్నా (1947), తిరుగుబాటు (1948), మొదటిరాత్రి (1949) చిత్రాలకు కామెరామన్‌గా ఉన్నారు

### ఎం వి రహమాన్

కామెరామన్ 1951 చిత్రం పేరంటాలు

జననం 1914 1930 లో బెంగుళూరు సూర్యా ఫిలిం కంపెనీలో సైలెంటు చిత్రాలు తీయనారంభించారు మొదటి టాకీచిత్రం 'మిసర్ కానితారా' (1935 బొంబాయి వాడియా మూవీటోన్) 1936–40 దాకా పేల్ ఎక్చర్స్‌లో పనిచేశారు తరువాత రేణుకాలో పనిచేశారు 1945 నుంచి స్వతంత్రంగా పనిచేస్తున్నారు ఈయన మొత్తం 40 సైలెంటు చిత్రాలూ, 20 టాకీలూ తీశారు 1951 లో లలిత శ్రీ ఎక్చర్స్ ప్రారంభించి చిత్రం తీయబోతున్నారు

ప్రస్తుతం పనిచేస్తున్న చిత్రాలు అవర్ హోం దాసి

### పి ఎల్ రాయ్

కామెరామన్ 1951 చిత్రాలు ఆకాశరాజు నిరోషి, మాయలమారి

జననం 1916 1936 ప్రాంతాల దర్యానీ ప్రొడక్షన్స్‌లో గోవర్ధన్‌భాయ్ పటేల్ కింద అసిస్టెంటుగా సినిమారంగంలో ప్రవేశించారు 1940 లో స్వతంత్రంగా మందారవతి తమిళచిత్రానికి కామెరామన్‌గా పనిచేశారు మొత్తం 12 చిత్రాలలో పనిచేశారు

ప్రస్తుతం ప్రతిభావారి చిన్నకోడలు ఎం కె ఎం వారి మరదలుపెళ్లి మద్రాస్ ఆర్ట్సువారి రోహిణి చిత్రాలలో పనిచేస్తున్నారు

### బోళ్ల సుబ్బారావు బి ఏ

కామెరామన్ 1951 చిత్రాలు అగ్నిపరీక్ష మంత్రదండం

జననం 1917 1939 లో రంజిత్ మూవీటోన్ (బొంబాయి) వారి లాబొరేటరీలో ప్రవేశించి అనంతరం కృష్ణగోపాల్ కింద కామెరా పనినేర్చుకుని, చాందినీ దేవకన్య, అంగూరీ అనే హిందీచిత్రాలకు స్వతంత్రంగా పనిచేశారు ప్రభుత్వంవారి ఎడ్యుకేషనల్ షార్ట్స్ 12 దాకా తీసి స్వయంగా డైరెక్టుచేశారు ఈ చిత్రాలు హిందీలో తయారై వివిధభాషలలో డబ్ చేయబడ్డాయి 1946 జూన్‌లో స్టార్ కంబైన్స్‌లో ప్రవేశించి విజయలక్ష్మి సంసారనౌక, రాజవిక్రమ అనే తమిళ చిత్రాలు తీశారు సంసారం కామెరామన్

ప్రస్తుతం రిక్షావాలా ప్రియురాలు చిత్రాలకు కామెరామన్‌గా, గీతాప్రొడక్షన్సువారి కొత్తచిత్రానికి డైరెక్టరు, కామెరామన్‌గా పనిచేస్తున్నారు

## బి ఎస్ కొండారెడ్డి



ఆపరేటివ్ కెమెరామాన్ 1951 చిత్రం మల్లీశ్వరి

జననం 1920 1949 లో మార్కస్ బార్ట్లే కింద ఎప్రెంటిస్ గా సినిమా రంగంలో ప్రవేశించారు ఆదీశరానీ కింద ఆపరేటివ్ కెమెరామన్ గా మల్లీశ్వరికి పనిచేశారు

ప్రస్తుతం వాహినీవారి పెదమనుషులు చిత్రానికి పనిచేయ్యనున్నారు విజయావారి చంద్రహారం చిత్రానికి స్వతంత్రంగా పనిచేస్తున్నారు

## డి ఎల్ నారాయణ (అన్నయ్య)



కెమెరామాన్ 1951 చిత్రం తిలోత్తమ

మొదటిసారి 1935 లో కొల్హాపూరులో ద్రౌపదీ వస్త్రాపహరణ తో సినిమా రంగంలో ప్రవేశించి తరువాత మద్రాసు వచ్చి రోహిణీ ఎక్స్చేంజ్ లో పనిచేశారు తిరిగి పూనా వెళ్లి అక్కడ షాలిమార్ సినీటోన్ లో పనిచేశారు 1946 లో మద్రాసువచ్చి శోభనాచల స్టూడియోలో చేరి 1951 అక్టోబరుదాకా పనిచేశారు కీలుగుర్రం తిలోత్తమ చిత్రాలకు పనిచేశారు

ప్రస్తుతం స్వతంత్రంగా ప్రియురాలు, ఆదర్శం, దేశదిమ్మరి చిత్రాలకు పనిచేస్తున్నారు

## కమల్ ఘోష్



కెమెరామాన్ 1951 చిత్రం మంగళ

జననం 1911 1933 లో బరువా స్టూడియోకు చెందిన కృష్ణ గోపాల్ లాబొరేటరీలో ప్రవేశించారు (దేవకీబోసు మేనల్లుడు) 1934 లో ఈస్టిండియా కంపెనీలో అసిస్టెంటు కెమెరామాన్ 1937 లో స్వతంత్రంగా కెమెరామాన్ గా కర్దార్ చిత్రానికి పనిచేశారు 1937 లో ఎం పి పి సి (ఇప్పుడు జెమిని) లో ప్రవేశించి బాలయోగినితో ప్రారంభించి 12 తెలుగుచిత్రాలకు పనిచేశారు తరువాత కచదేవయాని, తల్లిప్రేమ తీసి 1941 లో జెమినీలో చేరారు చంద్రలేఖ నిషాన్, మంగళ చిత్రాలకు కెమెరా మాన్ నిషాన్ చిత్రానికిగాను ఈయనకు అఖిలభారత రంగంలో బహుమానం వచ్చింది

ప్రస్తుతం ప్రేమ, పరదేశి, కృష్ణవేణి తీయబోయే చిత్రాలకు పనిచేస్తున్నారు

### పళయుకారన్ ఎల్లప్ప

కామెరామాన్ 1951 చిత్రం సౌదామిని

జననం 1910 1930 లో రాజాశాండోగారి సైలెంటు చిత్రాలలో నటుడు 1935 లో కె సుబ్రహ్మణ్యంగారికి సహాయ దర్శకుడుగా ఉంటూ, కామెరామాన్ శోపికార్ కింద అసిస్టెంటుగా కూడా పనిచేశారు తరువాత అసిస్టెంటుగా కామెరామాన్ నాడ్కర్ణికింద పనిచేశారు 1939 లో ఎం పి పి సి (ఇప్పుడు జెమిని) లో ప్రవేశించి శైలేన్‌బోస్ కింద పనిచేశారు తరువాత వేల్‌ఎక్చర్స్‌లోనూ అనంతరం జెమినీలోనూ పనిచేశారు పాదుక, హరిశ్చంద్ర (తమిళం) చిత్రాలకు అసిస్టెంటు కామెరామాన్ (కామెరామాన్ కనుక ఘోష్) చంద్రలేఖకు ఆపరేటివ్ కామెరామాన్ జెమినీవారి సంసారం (హిందీ తమిళం) చిత్రానికి కామెరామాన్ ప్రస్తుతం రాజరాజేశ్వరీవారి పేదరైతుకు కామెరామాన్



కామెరామన్ రామచంద్రన్

# డాన్సు డైరెక్టర్లు

### వెంపటి సత్యం



డాన్సుడైరెక్టరు 1951 చిత్రాలు: అగ్నిపరీక్ష, నిర్దోషి, సౌదామిని పేరంటాలు

జననం ం సినిమాలలో ప్రవేశ. 1941 లో మీరాబాయిలో డాన్సుడైరెక్టరుగా నాటినుండి సుమారు 40 చిత్రాలకు పనిచేశారు

ప్రస్తుతం ఈయన పనిచేస్తున్న చిత్రాలు సాహసం మాళవతి, మంజరి ఆడబ్రతుకు పాలేరు మైహోం

### పసుమర్తి కృష్ణమూర్తి

డాన్సుడైరెక్టరు 1951 చిత్రాలు 'పాతాళభైరవి 'మంత్రదండం 'మల్లీశ్వరి

జననం 1926 1948 జూలైలో 'గుణసుందరికథ కు డాన్సు డైరెక్టరుగా సినిమారంగంలో ప్రవేశించారు (ప్రసిద్ధ భరతనాట్యాచార్యుడు చింతా వెంకటరామయ్యగారి మనుమడు, శిష్యుడు) విజయావారి పర్మనెంటు ఆర్టిస్టు

ఈయన డాన్సుడైరెక్టరుగా పనిచేసిన చిత్రాలు 'తిరుగుబాటు 'పరమానందయ్య శిష్యులు', 'సంసారం

ప్రస్తుతం పనిచేస్తున్న చిత్రాలు విజయావారి 'పెళ్లిచేసి చూడు, 'చంద్రహారం, భరణీవారి 'ప్రేమ, రాగిణీవారి ర వచిత్రం యువావారి 'టింగ్‌రంగా' వగైరా



జయశంకర
జెమిని డాన్సు డైరెక్టర్



ప్రతిభా వారి

# చిన్నకోడలు

త్వరలో వస్తోంది!

నిర్మాత : దర్శకుడు
జి. బలరామయ్య

డిస్ట్రిబ్యూటర్లు :
ఆంధ్ర - రాయలసీమ నవయుగ ఫిలింస్, విజయవాడ.
మైసూరు - హైదరాబాద్ రాజశ్రీ పిక్చర్సు లిమిటెడ్, బెంగుళూరు : సికింద్రాబాద్.

# ఆర్టు డైరెక్టర్లు

టి వి ఎస్ శర్మ



ఆర్టు డైరెక్టరు 19 1 చిత్రాలు 'తిలోత్తమ' 'ఆయలకూరి', 'రూపవతి' 'దీక్ష' 'మంత్రదండం' 'పేరంటాలు'

జననం 1909 సినిమారంగంలో తొలిప్రవేశం 1929 లో దాదా అరల్కార్ గారి 'స్వర్ణమందిర్' లో కొల్హాపూర్ బొంబాయిలలో కొంత సినిమా అనుభవం గడించి 1934 లో మద్రాసువచ్చి స్టార్ కంబైన్స్ శ్రీరామాఫిలిమ్స్ జగదీశ ఫిలిమ్స్ తమిళ్నాడ్ టాకీస్ సినీమాఫిలిమ్స్ ఎ వి ఎం ఫేమస్ ఫిలిమ్స్ గ్రేట్ ఈస్టర్న్ పిక్చర్స్ సంస్థలలో పనిచేసి, 'భక్త' చిత్రంనుంచి శోభనాచల స్టూడియో ఆర్టిస్టుగా ఉంటున్నారు ఈయన కళాదర్శకత్వం చేసిన చిత్రాలు సుమారు 50

ఇప్పుడు పనిచేస్తున్న చిత్రాలు: 'ప్రియురాలు' 'సావాసం' 'అగ్రబతుకు', 'దాసి', 'పరదేశి' 'పాతేశు' 'మైహోం' వగైరా

## శేఖర్

ఆర్టు డైరెక్టరు 1951 చిత్రం మల్లీశ్వరి

జననం 1907 తొలిచిత్రం సీతాకల్యాణం అప్పటినుంచి ఈయన ఆర్టు డైరెక్టరుగా సౌండు రికార్డిస్టుగా అసోసియేట్ ప్రొడ్యూసరుగా 80 చిత్రాలలో పనిచేశారు ఉదయశంకర్ గారి 'కల్పన' కు ఆర్టుడైరెక్టరు 1936–39 లో కార్తికేయా స్టూడియోస్‌లో భాగస్వామి 19 9–42 లో వాహినీ ఎం.ఎల్.లో 42–48 లో జెమినీలోనూ పనిచేశారు తరువాత స్వతంత్రంగా పనిచేస్తున్నారు



ప్రస్తుతం మనోహరా (జూపిటర్ వారి చిత్రం—తమిళం, తెలుగు వాండీ) మనోహర్, పరిమళా ప్రొడక్షన్సువారి 'స్వర్గ ద్వారం' చిత్రాలకు పనిచేస్తున్నారు

## మాధవపెద్ది గోఖలే

ఆర్టుడైరెక్టరు 1951 చిత్రం పాతాళభైరవి

జననం 1917 1938 రైతుబిడ్డలో తొలిప్రవేశం 1949 నుంచి వాహినీ స్టూడియోలో పనిచేస్తూ షావుకారులో పనిచేశారు 1951 నుంచి స్టూడియో ఆర్టిస్టు ప్రస్తుతం పెళ్లిచేసిచూడు, చంద్రహారం చిత్రాలకు పనిచేస్తున్నారు

## కళాధర్ (సూరపనేని)

ఆర్టుడైరెక్టరు 1951 చిత్రం పాతాళభైరవి

జననం 1918 తొలిప్రవేశం గృహప్రవేశంలో [illegible] అసోసియేట్‌గా తరువాత మనదేశం 1949 లో వాహినీ స్టూడియోలో చేరి అసోసియేట్ ఆర్టుడైరెక్టరుగా పనిచేసిన చిత్రం షావుకారు పనిచేస్తున్న చిత్రాలు పెళ్లిచేసిచూడు చంద్రహారం

## వాలి

ఆర్టుడైరెక్టరు 1951 చిత్రాలు అగ్నిపరీక్ష మాయలమారి, స్త్రీసాహసం



జననం 1914 1937 లో ఆంధ్రాటాకీస్‌లో అడవి బాపిరాజుగారి కింద కళాసహాయానికి పూనుకున్నారు చల్ మోహనరంగలో అభినయించారు తరువాత అనేక చిత్రాలలో ఆర్టు, మేకప్ దుస్తులు వగైరా కళాసహాయం చేశారు గొల్లభామ పల్నాటియుద్ధం పల్లెటూరిపిల్ల, భాగ్యలక్ష్మి చిత్రాలకు పని చేశారు

ఇప్పుడు వినోదావారి చిత్రాలలోనూ, యువావారి జి గరంగాలోనూ, అంజలీవారి పరదేశిలోనూ, చేతనావారి జేకదిమ్మరిలోనూ, బి. ఎ సుబ్బారావుగారి చిత్రాలలోనూ పనిచేస్తున్నారు

### సిహెచ్ ఇ ప్రసాద్

ఆర్టుడైరెక్టరు 1951 చిత్రం నిర్దోషి
1951 లో సినిమారంగంలో ప్రవేశించారు ప్రస్తుతం జయావారి రిక్షావాలా, ఎం కె ఎం వారి మరదలుపెళ్లి శుభోదయావారి ఆదర్శం, అజంతావారి వయారిభామ చిత్రాలకు ఆర్టుడైరెక్టరుగా పనిచేస్తున్నారు

# సౌండ్ రికార్డిస్టులు

### క్రిష్ణయ్యర్ బి ఏ

సౌండ్ ఇంజనీర్, వాహినీస్టూడియో
జననం 1905 1937 లో కార్తికేయా స్టూడియోలో సౌండ్ ఇంజనీర్‌గా సినిమారంగ ప్రవేశం చేశారు తరువాత వాహినీ న్యూటోన్, రేణుకా సంస్థలలో పనిచేసి 1949 లో వాహినీస్టూడియో ప్రారంభించినప్పటినుండి అక్కడ తయారయే చిత్రాలన్నిటికీ పనిచేస్తున్నారు

### పర్వతనేని రంగారావు ఏ ఇ ఇ

సౌండ్ ఇంజనీర్ జెమినీ స్టూడియో
జననం 1913 19 6 లో సినిమారంగంలో ప్రవేశించి కోయంబత్తూరు సెంట్రల్ స్టూడియోలో జర్మన్ ఇంజనీర్ దగ్గర సౌండ్ రికార్డింగులో శిక్షణపొందారు 1937 లో ఎం ఎ పి సి (ఇప్పుడు జెమిని)లో ఎ కె విశ్వనాథం (ప్రస్తుతం ప్రభుత్వ ఫిలింశాఖలో ఉన్న సౌండ్ ఇంజనీరు) వద్ద అసిస్టెంటుగా చేరారు 1939 లో స్వతంత్రంగా పనిచేసి తిరిగి జెమినీ ప్రారంభించగానే అందులో చేరి ఇప్పటికీ పనిచేస్తున్నారు

### వల్లభజోస్యుల శివరాం బి ఎ బి ఎస్ సి

సౌండ్ రికార్డిస్టు వాహినీ స్టూడియో
జననం 1917 సినిమాలలో ప్రవేశం 1941 లో వాహినీవారి పోతనలో నటుడుగా తిరిగి 1946 లో మాయామచ్ఛీంద్రలోనూ 1951 లో దీక్షలోనూ నటుడుగా పనిచేశారు 1949 నుంచి వాహినీ స్టూడియోలో రికార్డిస్టుగా పనిచేశారు

# లాబ్ సూపర్నెంట్లు

### ఎం బి కుండల్

లాబ్ సూపర్నెంట్ శోభనాచల స్టూడియో
జననం 1908 1928 లో సినిమారంగంలో ప్రవేశించారు వేల్ పిక్చర్స్, నేషనల్ మూవీటోన్, న్యూటోన్ స్టూడియో, కుబేరాపిక్చర్స్, మోడర్న్ సినీ లాబొరేటరీలలో పనిచేసి ఇప్పుడు శోభనాచల స్టూడియోలో ఉన్నారు

### ఆసూరి విజయరాఘవాచారి రామస్వామి బి ఎస్‌సి

లాబొరేటరీ సూపర్నెంట్ జెమినీ స్టూడియో
జననం 1912 1934 లో సినిమాలలో ప్రవేశించి వేల్ పిక్చర్స్‌లో కామెరామాన్ రామనాథ్ గారికి అసిస్టెంటుగా చేరారు తరువాత కార్తికేయా స్టూడియోస్‌లోనూ, జయాఫిలిమ్స్ (ప్రస్తుతం శోభనాచల) లోనూ, భారత్ మూవీటోన్‌లోనూ పనిచేసి 1942 నుండి జెమినీ స్టూడియోలో ఉంటున్నారు



# ఎడిటర్లు

## నరికుట్టి గోపాల్

ఎడిటర్, జెమినీస్టూడియో

జననం 1900 1928 లో బెజవాడ మారుతీ సినిమాలో ఆపరేటరుగా నేర్చుకుని, గుంటూరు రత్న సినిమాలో చీఫ్ ఆపరేటరుగా పనిచేసి తరువాత జనరల్ పిక్చర్స్ కార్పొరేషన్‌లో సైలెంటు చిత్రాలకు అసిస్టెంటు ఎడిటరుగా చేరారు 12 సైలెంటు చిత్రాలకు అసిస్టెంటు ఎడిటరు టాకీలు వచ్చాక శ్రీనివాస సినీటోన్‌లో ఎడిటరుగా పనిచేశారు స్వతంత్రంగా చాలా చిత్రాలకు పనిచేసి జెమినీస్టూడియోలో చేరారు

## ఎం వి రాజన్



ఎడిటర్ 1951 చిత్రం దీక్ష

జననం 1915 1935 లో తొలిగా సినిమారంగంలో ప్రవేశించి శిరాజ్ గారి ఫేమస్ సినీ లాబొరేటరీ (బొంబాయి) లో 1937 దాకా ఎడిటింగ్ ప్రింటింగ్ చేశారు. 1938 లో గృహలక్ష్మికి అసోసియేట్ ఎడిటరు అనేక డాక్యుమెంటరీ (ప్రభుత్వ) చిత్రాలు ఎడిట్ చేశారు ప్రస్తుతం మానవతి, జ్యోతి చిత్రాలు ఎడిట్ చేస్తున్నారు



ఎడిటర్ హెచ్ ఆర్ నారాయణ

# రచయితలు

## తాపీ ధర్మారావునాయుడు

సినిమా రచయిత 1951 చిత్రాలు: మంగళ అగ్నిపరీక్ష దీక్ష మంత్రదండం తిలోత్తమ మాయలమారి

జననం 1887 తొలిచిత్రాలు మాలపిల్ల మోహినీ రుక్మాంగద సారంగధర ఇప్పటికి కనీసం 25 చిత్రాలకు పాటలూ మాటలూ కథలూ రాశారు

ప్రస్తుతం తయారులో ఉన్న ఈ ఐదు చిత్రాలకు రచన చేశారు ఆడబ్రతుకు టింగ్ రంగా సాహసం మానవతి కన్నతల్లి కృష్ణవేణిగారి కొత్తచిత్రం

## సముద్రాల వెంకటరాఘవాచార్య

సినిమా రచయిత 1951 చిత్రాలు సౌదామిని స్త్రీసాహసం, పెళ్ళికూతురు

జననం 1902 సినిమా ప్రవేశం 1936 లో కనకతార రచయితగా సుమారు 80 చిత్రాలకు పాటలు మాటలు రాశారు 1938 నుండి 1945 దాకా వాహినీలోనే పనిచేస్తున్నారు 1950 లో



సాధించిన వినోదా సంస్థలో భాగస్వామి 'స్త్రీసాహసం పర్యవేక్షణచేశారు వినోదాతరఫున డైరెక్టరు రచయితగా 'బాలసన్యాసమ్మకథ తీయబోతున్నారు 'దేవదాసు స్క్రిప్టు రాశారు

## దేవులపల్లి కృష్ణశాస్త్రి



సినిమా రచయిత చిత్ర 'మల్లీశ్వరి

జననం 1897 ప్రథమచిత్రం మల్లీశ్వరి దీనికి పాటలు, మాటలూ రాశారు ప్రస్తుతం అవర్ ఇండియావారి 'మొహరాం కూ జెమినీవారి 19 వ చిత్రానికీ కె అండ్ కె వారి కొత్త సాంఘిక చిత్రానికీ రచన చేస్తున్నారు

## పింగళి నాగేంద్రరావు

సినిమా రచయిత 1951 చిత్రం పాతాళభైరవి

జననం 1901 1943 లో భలేపెళ్ళికి పాటలు మాటలు రాసి సినిమారంగం ప్రవేశించారు తరువాత 1947 లో తమ వింధ్యరాణి నాటకాన్ని స్క్రిప్టుగా రాశారు అనంతరం వాహినీవారి గుణసుందరికి స్క్రిప్టు రాశారు తరువాత విజయావారి పర్మనెంట్ ఆర్టిస్టుగా ఉండి ప్రస్తుతం చంద్రహారం చిత్రానికి కథ, పాటలూ, మాటలూ రాస్తున్నారు

## శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ శ్రీ)



సినిమా రచయిత 1951 చిత్రం నిర్దోషి

జననం 1910 మొట్టమొదటగా 1949లో ఆహుతి చిత్రం తెనిగింపుతో సినిమారంగం ప్రవేశించారు నిర్దోషి రచయితలలో ఒకరు

ప్రస్తుతం సొసైటీవారి కొత్తచిత్రం మరదలుపెళ్ళి దేశదిమ్మరి లలిత శ్రీవారి కొత్తచిత్ర మనోహరా, పాలేరు, జైవీర బేతాళ్ చిత్రాలకు పనిచేస్తున్నారు



### కొపల్లె వెంకటరమణారావు

సినిమా రచయిత 1951 చిత్రం చంద్రవంక

జననం 1902 చంద్రవంకతోనే సినిమారంగంలో ప్రవేశించారు ప్రస్తుతం నాగూర్ గారి సందేహిక పనిచేస్తున్నారు చంద్రవంకలో చిన్నపాత్ర కూడా ధరించారు

### తోలేటి వెంకటరెడ్డి

సినిమా రచయిత 1951 చిత్రాలు నవ్వితే నవరత్నాలు, ఆడజన్మ దీక్ష (కొన్ని పాటలుమాత్రం)

జననం 1917 1947 లో 'రాధిక'కు సహాయదర్శకుడుగా సినిమారంగంలో ప్రవేశించారు 'మొదటిరాత్రి'కి అసిస్టెంటుగా పనిచేస్తూ కొన్ని పాటలు రాశారు సినిమా రచయితగా 'జీవితం' చిత్రానికి తొలిసారి పాటలు, మాటలు రాశారు తరువాత 'అదృష్టదీపుడు' చిత్రానికి రచయిత

ప్రస్తుతం పక్షిరాజా, కోహినూర్ థియేటర్స్, ఏ వి యం, జూపిటర్ సంస్థలకు రచయితగా పనిచేస్తున్నారు

### సదాశివబ్రహ్మం

సినిమా రచయిత 1951 చిత్రాలు : మాయపిల్ల, నిరోషి (కొంతభాగం)

జననం 1905 సినిమాలలో ప్రవేశం 1939 లో రాజా శాండో గారి చూడామణితో తరువాత తెనాలిరామకృష్ణ సత్యమేజయం, గొల్లభామ, మంగళసూత్రం రాధిక, సంసారం చిత్రాలకు రచయితగా పనిచేశారు రాధిక డైరెక్టుచేశారు

ప్రస్తుతం విజయలక్ష్మివారి 2వ చిత్రం, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి మొదటి చిత్రం, కృష్ణాపిక్చర్స్‌వారి 'అమ్మలక్కలు', రాజ్యంవారి దాసి, గజానన పిక్చర్స్‌వారి మొదటి చిత్రంలో పనిచేస్తున్నారు

### కొండముది గోపాలరాయశర్మ

సినిమా రచయిత 1951 చిత్రాలు రూపవతి, నిరోషి (పాటలు), అగ్నిపరీక్ష (పాటలు)

జననం 1920 సినిమారంగంలో ప్రవేశం 1947 లో పల్నాటియుద్ధంలో తరువాత భట్టివిక్రమార్క, సంసారం, పరమానందయ్య శిష్యులు చిత్రాలకు రచయితగా పనిచేశారు

ప్రస్తుతం భరణీవారి ప్రేమ, స్వాతివారి పగ, జూపిటర్స్‌వారి ముక్తిమార్గం, భాస్కర్‌వారి కొత్తచిత్రం, రాగిణీవారి కొత్తచిత్రాలలో పనిచేస్తున్నారు 

ఆబాలగోపాలానికి ఆనందాన్నిచ్చే
అనన్యకళాసృష్టి

నిర్వాహకులు
కె. పార్థసారథిరావు

దర్శక పర్యవేక్షణ
బి.వి. ఆర్

అసోసియేట్
జి వి రావు

సంగీతం
గాలిపెంచలయ్య

పాటలు
శ్రీ శ్రీ

కెమేరా
కొట్రస్

ఆర్ట్
పి.వి.నారాయణ

స్టూడియో
స్టార్‌కంబైన్సు- రేవతి

P.V. Narayan

అరుణా వారి
# జై వీరబేతాళ

# ఇంటగెలిచి

"పిల్లిని చంకన పెట్టుక వచ్చారంటారు కాని ఇదేమిటండీ"

"ఏమిటే?"

"ఏమిటే ఏమిటండీ! ఈ కోతి ఎక్కడ దాపురించిందండీ?"

"ఛా ఛా అలా అనకు హనుమాన్ హనుమాన్"

"ఈ తంపి ఏమిటండీ?"

"చాలులే నువ్వే నామాట లెక్క చేయకపోతే"

"అదేమిటండీ ఇప్పుడు నే నేమన్నాను ఈ జనకు బెత్తెగు కొంపలో ఈ"

"అదుగో అదే వద్దన్నా మన పార్టీ చిహ్నం మన పార్టీచిహ్నం హనుమాన్ జైహనుమాన్"

"ఏమిటె నిన్నేగా దసరా కుర్రాళ్లలా

"తినటానికి లేవుగాని, కోతులకూ, కొండముచ్చులకూ కూడా వస్తయేగావును లేవన్‌వాళ్ళను మీ హనుమాన్‌కు ఇవ్వమనండి టెంపరరీ లేవనింగ్ కార్డో లేక పర్మనెంటు లేవన్ కార్డో"

తలు పెవరో తట్టారు

అతను వెళ్ళి తీశాడు

"ఏమేవ్! మీ పెద్దమ్మ పెద్దకొడుకు వచ్చాడు" అన్నాడు

"అంతా కులాసా అన్నయ్యా" అంటూ చెంబుతో నీళ్లు తీసుకువెళ్ళింది

అన్నయ్య కాళ్లు కడుక్కొని, తెల్లపోయాడు - కుర్చీలో కూర్చున్న హనుమాన్‌ని చూసి

"ఇదేమిటే అమ్మాయ్" అన్నాడు అన్నయ్య

"ఏంచెప్పను నాయనా మీ బావగారు కిష్కింధాపుర"

కాదన్నమాట లే అన్నయ్యా నీళ్లు సిద్ధంగా ఉన్నయ్ ఇంకోమ్మ కులాసాగా ఉందా? జ్వరం ఇంకా వస్తూనే ఉందా" అని అడిగింది సీత

"ఆ ఏమిటో నాకీ పనే సరిపోతోంది ఆవిడ లేచినరోజు లేస్తోంది పడుకున్నరోజున పడుకుంటోంది"

"అదేమిటన్నయ్యా"

"ఏంచేస్తాం ఇదుగో వద్దు వద్దంటె నలుగురు స్నేహితులు ఇదొకటి మెడకంట గట్టారు దీనితో ఊపిరాడ లేదు ఊరూరూ తిరగటం అడ్డమైనవాళ్ళనూ చూడటం గొంతుక బొంగురుకూడా పోతోంది"

"అయితే అమ్మసంగతి"

"పూజారి వైద్యుడు మందిస్తున్నాడులే. ఇదిగో ఈ పొట్లిలో గలిచాక, ఆవిడను

# [illegible]

బాణం పుచ్చుకుని తయారయారు మళ్లీ ఇవ్వాళ ఈ కో కాదు హనుమాన్"

"ఏపోలే ఆడవాళ్ళకేం తెలుస్తయ్ రాజకీయాలు ఈ హనుమాన్‌కి కాసిని టియ్యం ఇయ్యి"

"అలాగే మాటిట్లు కావద్దూ మీకు" అంటూ ఇంటావిడ లోపలకు పోయింది

హనుమాన్ కుర్చీ ఎక్కి కూర్చున్నాడు మూర్ఛపోయిన లక్ష్మణస్వామికి చేసిన మహోపకారం కంటె కూడా ఈ మానవమాత్రునికే ఎంకెక్కువ సహాయం కావ్య వలసిన సమయం వచ్చింది - హనుమాన్‌కు ఆనాడు, ఈనాడుకూడా రామరాజ్య సంరక్షణకే హనుమన్ నడుంవంచటం, కాదు తోక ఎత్తటం

ఇంట వి వంటంట్లోంచి ఎంతసేపటికీ రాకపోవటంతో హనుమాన్ భక్తుడు లోపలకు వెళ్ళి, "బియ్యం ఏవే?" అన్నాడు

ఆమె ఏమీ మాట్లాడలేదు

"నిన్నేనే?" అన్నాడు

"సరేలే ఏం బావగారూ! ఏమిటి మీరుకూడా నిలబడుతున్నారా?" అని వినయంగా అడిగాడు ఆంజనేయులు

"మీరుకూడా అంటె?" అన్నాడు రామం

"ఆ ఏంలేదు మీకు ఉత్తరం వ్రాద్దామని అనుకుంటున్నాను నేను నిలబడుతున్నాను నెమలికోసం ఎంత ప్రయత్నించినా దొరకలేదు ఒక నెమలిని ఊరేగిస్తే, అందరికీ మనగురించి సులభంగా బోధపడుతుంది

"నువ్వు కూడా నిలబడుతున్నావన్నమాట" అన్నాడు రామం

"స్లోగన్‌కూడా మంచిది దొరికింది 'నెమలికే నీ ఓటు' ఎలా ఉందండీ బావగారూ!" అన్నాడు ఆంజనేయులు

"నా స్లోగన్‌కూడా విను ఆంజనేయస్వామికే మీ ఓటు" అన్నాడు రామం

"అంటె మా అన్నయ్యకేగా" "చాలుగాని బావమరదులపోటీ భారతంలోనే

ఒకసారి పట్నం తీసుకుపోయి, ఎవరు పట్టుకు"

## 2

భోజనం ఆరంభమైంది అకులుబాగుకు వడియాలు నాలుగు వడ్డించింది

"ఇదిగో అన్నయ్యా బాణం అని, కోతి అని, కొమ్మచ్చు అని ఈ దశావతారాలతో మీబావ సతమతమవటమూ, ఇంట్లో

కూర నార ఉందో లేదో కూడా పట్టించుకో పోవటమూ ”

“అదేమిటే సాయంకాలం కొట్టు వాడిని బంగాళదుంపలు పంపమన్నానే ”

“అలాగేలేండి రేపు పొద్దుటికి వస్తయ్ . గంపెడు ”

ఆంజనేయులు పాపం చాలా ఆకలితో ఉన్నాడు బస్తీభోజనం ఇంత కేవలం వేదాంతప్రబోధంగా ఉంటుందని అతను ఊహించలేదు ఇంట్లో ముట్టి ఎరగని వడియాలనే ఎలాగో కరకర నములుతున్నాడు

“అబ్బ ఇవాళ మరీ నీళ్లుకలిపిందేమో ఆ గొల్లది మజ్జిగలో ?” అన్నాడు రామం

నిజానికి ఇంటావిడకు భగ్గున కోపం మండింది రెండు నెలలనుంచి ఆ గొల్లదానికి ఇవ్వవలసినది ఇవ్వక, దాన్ని ఇవ్వాళ అని, రేపని వేధించి, ప్రాణం తీస్తుంటే, ఇంకా నాలాంటి ఏసీళ్ళో తెల్ల నీళ్లు పోస్తోంది అదీ పొయ్యకపోతే!

ఇంతలో రామం మళ్లీ అందుకున్నాడు

“రేపటినుంచీ మజ్జిగ మాని పెరుగు తీసుకు రమ్మను ”

“చిత్తం!” అంది సీత

ఒక్కసారిగా సైకిళ్ళగంటలు గణగణమని మోగినయ్ నాయుడు నెత్తుకులా కోట్లో వేసుకొని ఇంటాయన గబగబా వీధిలోకి వెళ్లాడు సుమారు ఇరవయ్ సైకిళ్ళదాకా ఉన్నయ్ ముఖాలకు కోతిబొమ్మలను పెట్టుకొని కుర్రాళ్లు నిలబడ్డారు

రామం “భేష్ భేష్ ఇదుగో గంటలు మటుకు క్షణం ఆగకుండా మోగాలి తర్వాత రేపటినుంచీ ప్రతి సైకిల్ కి టార్చి . ఒకటార్చి ఉండాలి” అన్నాడు

వాళ్ళలో ఒకడు నీళ్లు నములుతూ “మరి మరి” అన్నాడు

అంతాకూడా స్పష్టాస్పష్టంగా ఏదో గొణిగారు

“ఏమిటి?” అన్నాడు రామం

“మరి ఆయన ఇంకో అర్ధరూపాయి ఇస్తామన్నారు ”

“అంటానికేంలే వెళ్లండి వెళ్లండి ” అన్నాడు రామం

“కాదులేండి కాదులేండి ” అని గొణిగారు కొందరు

అప్పుడే కొందరి ముఖాలు భయంకర శార్దూల ముఖాలైనయ్ ఆ అట్ట బొమ్మనే తిరగేశారు వెంటనే కోతులు కారిన ఆ ముఖాల్లో పెద్ద పులులు గాండ్రిస్తున్నయ్

రామం రెండడుగులు ముందుకు వేసి, “ఇదుగో ఉండండి ఉండండి” అన్నాడు

వాళ్లు అప్పుడే గంటలు మోగించుకుంటూ ఫర్లాంగుదూరం వెళ్లారు

దిగాలా ముఖంతో రామం వెనక్కు తిరగానే, నవ్వులకు దిక్కుతోయాడు భార్య, బావమరది విరగబడి నవ్వుతున్నారు

## 3

“ఇదుగో విన్నే” అన్నాడు రామం ఆప్యాయంగా

“ఏమిటి?” అంది సీత

‘ఏమిటి ఆ అదిగో పొరుగావిడతో ఆ పోరు పెట్టుకుంటావేమిటి?”

“ఏం?”

“ఏమేమిటే? తెల్లారి లేవగానె కలహాలా?” అన్నాడు రామం, శాంతస్వరంతో

“నాలుగేళ్లైంది ఈ యింట్లో అడుగు పెట్టి ” అని ఇంకా ఏమో ఇంటావిడ అనబోతుండగా రామం అందుకున్నాడు

“సరే ఇన్నాళ్లూ మీ ఇద్దరికీ నవ్వ పచ్చగడ్డి వేస్తే, భగ్గున మండుతోందనుకో, కాని ఇదిగో ఆ ఓట్ల పబ్బందాకా కొంత తమాయించు ఆవిడకు ఓటు ఆవిడ వినవాడ బిడ్డకు ఓటు ఆయన కూడా ఆవిడ ఎంత చెప్తే అంత కొంత ఆవిడతో ఈ నాలుగు రోజులూ మంచి చేసుకుంటె ” ఇంటావిడ కొంటెగానవ్వి, “నల్లి ఆవిడతోనే మాట్లాడిరండి ఇప్పుడాయన కూడా ఇంట్లో లేరు” అంది

రామం ఉత్సాహం పొంది, “ఇదిగో అయితే కొస్త ఆవిడను ఇటు పిలు ” అన్నాడు

పక్కావిడ కూడోపిల్ల, ఎనిమిదేళ్లపిల్ల గ్లాసుతో కాఫీ పోసి తెచ్చి, “మా అమ్మ ఇవ్వమంది” అని కిక్కు బిక్కు మంటూ నుంచుంది

సీత గ్లాసు అందుకొని, “ఇదుగో మా శారా తీసుకో వెళ్లటమేమో తలకు కొప్పుగా తీసుక వెళ్లటమూను తిరిగి ఇచ్చేటప్పుడు ఏమో అంచుకు కూడా నిండకుండా పంపటం” అని చివరించుకుంది

“ఇదుగో అదే కొస్త తగ్గమన్నాను కుండా గ్లాసు ఇచ్చిపంపు” అన్నాడు

పిల్ల గ్లాసుతో మళ్ళీ వెనక్కు తిరగకుండా పరుగెత్తింది

రామం మళ్లీ అందుకున్నాడు.

"ఆ కాస్త కాఫీ పొడికోసం ఈక్షణం లోనే మళ్ళీ నోరు పారేసుకుంటున్నావు ఈ నాలుగు రోజులూ కాస్త ఆగకే అంటే."

"అలాగే ఓటు ఓటు అని కాఫీ పొడులు, కారాలు పక్కవాళ్ళకు దానం చేస్తే బాగానే ఉంటుంది"

"సరేగాని ఇదుగో కృష్ణహితుడి కారువస్తుంది నువ్వేమో దబ్బున తయారవ్వమరి"

"ఇదిగో మొన్నే చెప్పేశా ఈ ఓటు జాతరకోసం నేను గడపదాటి బయలుదేరను. నావల్లకాదు," అంది సీత

"అది కాదే ఒక్కసారి నువ్వు వెళ్ళి, ఆడవాళ్ళతో మాట్లాడు చాలు తర్వాత సంగతి నే చూసుకుంటా" అన్నాడు రామం

బలవంతంమీద తయారైంది సీత

పెట్టె మూతతీసి చూసింది ఉహూ చేతికి తగలలేదు మళ్లీ చెయ్యి అంతాపెట్టి తడిమింది ఉహూ గుడ్డలన్నీ గాలించింది. ఉహూ లేదు ఏం అంత నలుసా తన ఇరుకు నయనాలకు కనపడకపోవటానికి పెట్టె బోర్లేసింది ఉహూ

వళ్ళంతా ముచ్చెమటలు పోసింది

"ఏమిటే అలా గగ్గోలు పడుతున్నావు ఏమిటా చెమటలు" అని సానుభూతితో అడిగాడు రామం

"చెమటలేమిటండీ తలప్రాణం తోకకు వస్తుంటె" అంది సీత

"ఏమిటా కంగారు"

"కంగారు! కావుంది నాలుగు వరసల గొలుసు కనపడకపోతే కంగారా! లేక"

"అదా. అలా చెప్పవేం ఓసే."

"ఏం మీరు తీసారా అబ్బ ఏది చెప్పండీ?"

"భద్రంగా ఉంది"

"ఏదండీ?"

"సుభద్రంగా ఉంది"

"ఏమిటా వెటకారితనం.. చెప్పమంటె?"

"60 ఏళ్లనుంచీ ప్రజాసేవ చేస్తున్న బ్యాంకులో అగ్ని, చౌర్య ప్రమాదాలకు లొంగని ఇనప్పెట్టెలో."

"ఏమిటండీ ఆ కులాసా కబుర్లు బ్యాంకులో తాకట్టుపెట్టారెప్పుడు? నాకు చెప్పకుండా"

"దానికేముంది? ఆ ఓట్లు కాస్తా అవగానే మన డబ్బు మనకు వచ్చేస్తుంది"

"ఏమిటో ఈ గోల డబ్బుకూ ఓట్లకూ"

"కేవలం పిచ్చితల్లివే డిపాజిట్టు కట్టద్దూ మరి"

సైకిల్ల గంటలు గణగణ మోగుతున్నయ్ నినాదాలు ప్రతిధ్వనిస్తున్నయ్

తలుపు తీయబోయింది సీత

వద్దన్నాడు రామం "అవన్నీ మనవి కావు వెనకలు నాకు వస్తామని మళ్ళీ అవతల ఆయనకు వెళ్లారు"

"కోతి అభ్యర్థికి డిపాజిట్టు కూడా దక్కదు" చెవుల్లో గింగురు మంటున్నయ్ ఆ మాటలు బోసి మెడ తడుముకుంటూ సీత భర్తకేసి చూసింది ఆమె ముఖంలో నెత్తురు చుక్క లేదు

కాసేపయాక ఆమె అంది "వచ్చినా నా ఓటు మీకియ్యను" ★

# రెండు నాటికలు

## శ్రీ పోతుకూచి సాంబశివరావు

(1 సూరిశాస్త్రి 2 బసవయ్య, 3 కనకమ్మ)

### 1 వ రంగం

బసవయ్య శాస్త్రిగారూ! మా అమ్మాయి కోసం ఒక సంబంధం చూసి పెట్టరు కొరూ!

సూరిశాస్త్రి చెబుదా మనుకుంటూనే ఉన్నాను పామెర్ల వెంకటరత్నంగారి అబ్బాయి ఒకడు యీ వూళ్ళోనే పనిచేస్తున్నాడు అది నా దృష్టిలో కనిపించే మంచి సంబంధాల్లో ఒకటి

కనకమ్మ పామెర్ల వెంకటరత్నంగారా! మా బావ తోడల్లుడు అన్నగారికి కొంచెం ఆయన దూరపుబంధువు మంచి కుటుంబం

సూ మామగారు లేరనే ఒక్కలోటే కానండి, ఆయన భార్య మాత్రం మామంచి యిల్లాలు లెండి!

బ అత్తగారు మంచిదైతే చాలదుటండి! పదిమంది మావగార్ల పెట్టు

సూ అంతేలెండి మంచి అనుభవం మీద సెలవిచ్చారు

క ఏదో మంచిరోజు చూసి ఆ అబ్బాయిని కలుసుకోరాదండీ!

బ అయితే ఆ అబ్బాయి అమ్మగారు యిక్కడే వున్నారా! అతని పెళ్ళివిషయం మనం ముందు ఎవరితో కదపాలి?

సూ వాళ్ళఅమ్మగారు ప్రస్తుతం అతని పెత్తండ్రిగారింట్లో వున్నారుట యీ వుంది సంసారులకి యింతకన్నా కావలసిందేముందండి!

క యీడూ జోడూ కూడా బాగుంటుంది

సూ బాగుండదటండీ! పిల్లాడు మాత్రం వరహాలమూట

బ కట్నం ఏ మాత్రంలో ఉంటుందంటారు?

క సంబంధం స్థిరపడనీయండి కట్నం ఎలాగైనా సర్దుకోవచ్చు

సూ ఇటువంటి సంబంధం పోగొట్టుకోకూడదండి ఉత్కృష్టమైన కుటుంబం దీనిగురించి ప్రత్యేకం నేనేమీ చెప్పనక్కర్లేదు

మనం యీ సంబంధం కోసం ప్రయత్నిద్దామండీ

బ అయితే అబ్బాయిగురించి వివరాలేమిటండి!

సూ ఎమ్ ఏ ప్యాసయినాడండి పాతికేళ్లుంగాయి

క మన అమ్మాయికి పద్దెనిమిదేళ్ళేగా! ఈడు అనుకూలంగానే ఉంటుంది

బ అయితే ఉద్యోగ మెక్కడ ఆ అబ్బాయికి! జీతం ఏమిస్తారేమిటి!

సూ ఏదో కాలేజీలో మేష్టరీ పనట! మూడువందలిస్తారుట!

క యింకనేం ఉద్యోగం చేస్తున్న పిల్లాడు దొరకడం చాలా అదృష్టమండి!

సూ పిల్లాడు మాత్రం చాలా బుద్ధిమంతుడు, వినయవంతుడూ కూడా

బ మనకి ముఖ్యంగా కావలిసిందే అది

సూ ఆస్తి యేమీ లేదనుకుంటా!

బ ఆస్తి మనల్ని రక్షిస్తుందటండీ! పిల్లవాడు బుద్ధిమంతుడై చదువుకున్నవాడైతే చాలదూ!

సూ తండ్రి యీ మధ్యనే పోయాడు! పాపం!

క అయ్యయ్యో! వెంకటరత్నంగారు చచ్చిపోయారన్నమాట! నేను ఆయన్ని ఎప్పుడూ చూడలేదు కానండి! మహాదొడ్డ మనిషి అని అంటారు

మధ్య యీ కష్టం వచ్చాక ఏడాదినుంచి అక్కడే వుంటున్నారుట పోనీ! చూచాయగా యీ విషయం ఆ అబ్బాయి తోటే కదిపి చూదాం! పెళ్లికొడుకయితే నేం! అతనూ! వయసు వచ్చిన పెద్దమనిషేగా!

క శాస్త్రి అన్నయ్యగారూ! రేపు చాలా మంచిరోజండి మీరు కొంచెం శ్రద్ధచేసి రేపే వెంకటరత్నంగారి అబ్బాయిని చూపించాలి

సూ అల్లాగేనమ్మా అన్నట్టు అతను మంచి కథలు కూడా వ్రాస్తాడుటండీ!

బ యింకనేం! మన అమ్మాయికి బాగా కాలక్షేపం అవుతుంది కథలంటే తెగ చెవికోసుకుంటుంది లెండి మా అమ్మాయి

సూ పైగా నాటకాలు కూడా వేస్తాడుట!

క మరీ బాగుంది! మా అమ్మాయికి కొంచెం సినీమాల ఖర్చు తగ్గుతుంది నాటకాలు యింక ఊరికే నే చూడవచ్చు ఏమిటో, నాటకాలన్నా, సినీమాలన్నా మహా చెడ్డ వెర్రి అండి మా పిల్లకి

బ అయితే మాపిల్ల నచ్చుతుందంటారా అబ్బాయికి!

సూ మీ పిల్ల కేమండి! రత్నాలకోవ చదువుకున్నపిల్లాయను, అందానికి అందం

క శుభస్య శీఘ్రం అన్నారు రేపు తప్పకుండా పిల్లవాణ్ణి చూసి, అమ్మాయిని చూపించే ఏర్పాటు చేయించండి

సూ తప్పకుండా నేను వెడతానండి బసవయ్యగారు

బ మంచిది

## 2 వ రంగం

(పెళ్లిచూపు లయినాక)

క: ఏమండీ! అబ్బాయిని చూశారు కదా! మీ అభిప్రాయం ఏమిటి?

బ పిల్లాడికేం! నిక్షేపంలా నిమ్మపండులా ఉన్నాడు

క ఆ అబ్బాయి కన్ను, ముక్కు తీరు ఏం చక్కగా ఉందంటారు! మన అమ్మాయికి సరైన వరుడు

బ వెంకటరత్నంగారిది చాలా మంచి కుటుంబంట! నేను వాకబుచేశాకూడ

క అగ్నిహోత్రంలాంటి కుటుంబమండి! నాకు తెలుసుగా!

బ: ఎంత సెమ్మది! ఆ కుఱ్ఱాడు చాలా వినయంగా మాట్లాడాడు సుమా నే వెళ్ళగానే!

క ఇటువంటి సంబంధం దొరకడం మన అదృష్టమండి అమ్మాయికి కూడా నచ్చాడుట

బ యింకనేం! యింక పిల్లవాడు ఒప్పుకోవడమే తరవాయి

క: పిల్లవాడికి మన అమ్మాయి నచ్చినట్టే కనిపించాడండి! పిల్లవాడు 'ఊ' అంటే కట్నం ఎంతైనా స్థిరపరిచేదామండీ

బ తప్పకుండా! రానీ! శాస్త్రిగారు రనాలిగా యీ వేళ ఏం కబురు తెస్తారో!

(సూరిశాస్త్రి ప్రవేశం)

బ రండి శాస్త్రిగారూ! మీ మాటే అనుకుంటున్నాం వెయ్యేళ్లు ఆయుష్షు మీకు

సూ: మా నాన్నకి యిలాగే ఎంతోమంది దీవన లిచ్చారండి! కాని ఆయన 40వ ఏటే తపీమని చచ్చిపోయాడు

బ (నవ్వి) అయితే యింతకీ పండా? కాయా?

సూ ఏమిటోనండీ! నాకు యిటువంటి వన్నీ చూస్తోంటే ప్రపంచం పచ్చి దగా అనిపిస్తోందండీ!

క అదేమిటండీ! అసలు సంగతి చెప్పండి!

సూ అతివినయం ధూర్తలక్షణం నేను యింకా ఏమిటో అనుకున్నాను

బ పిల్లవాడుకాని ఏమన్నా దురుసుగా మాట్లాడేడా!

సూ పెద్ద దురుసుతనం కాదండి! యీ మాత్రం దానికి పిల్లని చూడటం ఎందుకూ అంట!

బ కొంపదీసి! పిల్ల నచ్చలేదన్నాడాండి!

సూ మరింకేమంటాడు! పైగా, కారణం ఏమిటీ అని కూడా అడిగాను

బ ఊఁ

సూ నచ్చలేదంటాడే గాని, కారణం చెప్పడు!

క చూశారా! పిల్లని చూశేటప్పుడు ఎంత దొంగనటన చేశాడో! యింత నటించవలసిన అగత్యం ఏం వచ్చిందండీ! అతని వాలకం చూసి పిల్ల నచ్చిందనుకున్నాను నేను

బ నాటకాలు నేర్చినమనిషి ఆమాత్రం చెయ్యడూ!

సూ మా బాగా అన్నారు

బ యింతకీ నచ్చకపోవడానికి కారణం చెప్పాడాండి!

సూ మొదట చెప్పలేదనుకోండి! కాని ఏదో కారణం చెప్పకపోతే ఏం బాగుంటుంది ఏదో ఒకటి చెప్పి తీరాలి అని అడిగాను చివరికి అన్నాడు, "పిల్లకి కొంచెం పిల్లికళ్లు"అని నాకు ఒళ్ళు మండిపోయిందిలెండి!

క మా అమ్మాయికి పిల్లికళ్లా! అక్కడికి వాడి మొహం బాగున్నట్టు! డొప్ప ముక్కు, ఎత్తుపళ్లు, పిట్ట మొహం వేసుకుని!

బ నేను మొదటే అనుకున్నాను వాడి జంఘన్నలా పొడుగ్గా ఉన్నాడు వీడు. మన అమ్మాయికి ఏం బాగుంటాడా అని

సూ: యీ సంబంధం చెడిపోయినందుకు ఏం విచారపడనక్కర్లేదు యింతకీ మావగారు లేని కుటుంబం

బ అన్నట్టు వెంకటరత్నంగారి భార్య, మొగుడు పోయినా నెత్తిన జుట్టు వుంచుకుందట!

క రామ! రామ! నలభై ఏళ్లొంటూ యనుకుంటూ ఆవిడకు యింకా యీ విలాసమెందుకండి! అయితే ఏడాదినుంచి బావగారి యింట్లోనే వుంటూంద అన్నమాట కొడుకు యీ వూళ్ళో తిండికి యిబ్బందిపడుతున్నాడనే గొడవే లేకుండా!

బ అటువంటి కుటుంబం కాబట్టే, యీ అబ్బాయి, వెర్రిమొర్రి కవిత్వాలు, రౌడీలాడే నాటకాలు, పట్టుకు వేళ్లాడుతన్నాడు

సూ అంతేలెండి! నేను ఏమిటో అనుకున్నాను గాని యిది పెద్ద చెప్పకోదగ్గ సంబంధం కాదండి! యింకా నా చేతిలో చక్కనైన సంబంధాలున్నాయి

బ ఆ కుఱ్ఱాడికి పాతికేళ్ళు మన అమ్మాయికి పద్దెనిమిదేళ్ళేగా! పెళ్ళి కుదిర్చేప్పుడు ఏడేళ్లు తేడా వుండకూడదండి!

క ఆ అబ్బాయికి ఇరవైఏడేళ్ళదాక పెళ్లి కానందుకు ఏదో కారణం ఉండి వుంటుంది కుటుంబంలో యింకా మనకు తెలియని ఏం లోపాలున్నాయో! పరంబ్రిపీమన్నా పిల్లనియ్యడానికి తయారయ్యేం కాని!

బ వచ్చిన సంబంధాలన్నీ యిలా తిరక్కొడితే, పిల్ల నెవరిస్తారండి యీ కుఱ్ఱాడికి అందుకే పాతికేళ్ళు వచ్చినా పెళ్లి కాకపోవచ్చు

క. పైగా యింకా ఏం చెడుబుద్ధులున్నాయో! పాతికేళ్ళదాకా పెళ్ళి చేసుకోనివాళ్లని ఒకవిధంగా మంచివాళ్లని నమ్మడం కష్టం బాబు!

సూ కనకమ్మగారి ఊహ నిజం కావచ్చు రాత్రి 12 గంటలు ఒంటిగంటదాక ఆ అబ్బాయి యింటికే రాడుట! వచ్చినా ఒక పట్టున నిద్రపోడుట కూడా!

బ యింతకీ పిల్లాడికి కానీ ఆస్తి లేదాయె సంబంధం చెడినందుకు మరేం బెంగ పెట్టుకోనక్కర్లేదు

క యీ చదువులు, వుద్యోగాలు ఎంత కాలం రక్షిస్తాయండి ఎంత సంపాదించినా చాలదు యీ కాలంలో నాలుగు రాళ్లు వెనక వేసుకున్నవాడే గొప్పవాడు యీసారి మన అమ్మాయికి ఆస్తి వున్న సంబంధమే చెయ్యండి అన్నట్టు అసలు వెంకటరత్నంగారు పెంపుడుకదా! చాలా ఆస్తి వుండాలే!

సూ ఆస్తి అంతా పేకాటల్లో తగలబెట్టాడుట!

బ తండ్రికి పేకాట! కొడుక్కి వెర్రిమొర్రి రాతలు! నాటకాలు!! వహ్వా! బాగానేవుంది గుణసంపత్తి యీ కుటుంబానికి యిటువంటి పాడుసంబంధం చెడినందుకు విచారం లేదు

సూ ఇతను చాలా పెంకిటండి! తను పట్టిన పట్టు వదిలిపెట్టడుట!

క వయం! యిటువంటి మొండిపీనుగని తెలిస్తే, అసలు పిల్లాడి మొహం చూసేవాళ్ళమా! పెళ్ళి స్థిరపరిస్తే గొంతిలో దిగేవాళ్ళం

బ పోనీలెండి! అంతా మన మేలు కొరకే! యీ సంబంధం యిలా పాడుదని తెలిసే దేముడు దీన్ని చెడగొట్టివుంటాడు

క సంబంధం చెడిపోడానికి నాకొక అనుమానం కలిగింది సుమండి! అమ్మాయిని చూడడానికి వచ్చేటప్పుడు, శాస్త్రిగారు, ఆ అబ్బాయి, అతని స్నేహితుడు ముగ్గురు వచ్చారు ముగ్గురు కలిసి చేసిన ఏ పనైనా ముక్కలైపోతుందని మొదటినుంచి నేను బాధపడుతూనే వున్నాను

సూ నేను ఆ అబ్బాయికంటె ముందు వచ్చేశానండి ఆ అబ్బాయి అతని స్నేహితుడు కలిసి వచ్చేరు అమ్మాయిని చూడడానికి అంత తొందరగా వచ్చేరని నేనేం అనలేదు

బ అదికాదే! నేను ఫలహారాలు తయారుచేయించ వద్దన్నాను కాని నువ్వే బలవంతపెట్టి అన్నీ చేశావు మనవంశంలో పెళ్ళిసంబంధాలకి ఫలహారాలు పెట్టే ఆచారం లేదని అంటే విన్నావూ? కతుకుతే అతకదని సామెత వుందిగా?

క కాని తెగతిన్నాడు సుమండి ఫలహారాలన్నీ మింగిలాగ అంత పిల్లనచ్చని వాడ్ని ప్లేట్లన్నీ ఖాళీ చెయ్యమని ఎవడు చెప్పాడండీ! పెట్టింది తిండమే గాకుండా, పైగా అడిగి వేయించుకొని తిన్నాడండీ!

బ యిటువంటి తిండిపోతు పెళ్లానికేం పెడతాడు! సంపాదించిందంతా, తనే తినేసి, పెళ్లాన్ని పస్తులు పడుకోబెడతాడు

సూ మా బాగా సెలవిచ్చారు కాని నాకు కొంచెం చిన్నతనంగా ఉందండి మీదగ్గర యీ సంబంధం కుదురుస్తానని తీసుకున్న నూట పదహారు రూపాయలు ఖర్చయిపోయాయి గాని, యీ సంబంధం మీకు కుదర్చలేకపోయానే అని చింతగా వుందంటే నమ్మండి!

బ డబ్బు కాక్యేతంటండీ మాట, మంచి, పని, ముఖ్యం యీ పాడు సంబంధం తప్పినందుకు, మీకు 116 రూపాయలు బహుమానంగా యిచ్చేమనుకోండి

క యింతకన్నా మంచి సంబంధాలేమైనా చెప్పండి శాస్త్రిఅన్నయ్యగారూ!

సూ అలాగేనమ్మా వాకబుచేసి మళ్లీ చెప్తాగా! వెళ్లివస్తానండి బసవయ్యగారూ!

బ మంచిది

(నిష్క్రమణ)

* * *

(దారిలో)

సూ (స్వగతం) ఈ నూటపదహారు రూపాయిల్లో పైపదహారు రూపాయలు, పిల్లని చూపించడానికి తీసుకువచ్చిన కుర్రాళ్లిద్దరికీ, వెంకటరత్నంగారి కుటుంబం మంచిదని బుజువు చెప్పినవాడికీ టిఫిను ఖర్చుల క్రింద పంచిపెట్టేస్తే, మనకి యింక నూరు రూపాయలు నికర లాభం!! యీ రోజు మంచి బేరం కుదిరింది ఏమండీ! నాలుసార్లు ఏ కుటుంబంలోనైనా వెళ్ళి వస్తూంటే యిటువంటి కిటుకులు యిట్టే తెలుస్తాయి పాపం వెంకటరత్నంగారని ఆ దంపతులు అనుకుంటూంటే విన్నను మొక్కగా!! అయ్యవారి మనకేం తెలుసు!! యింతకీ మాటకి డబ్బు దొరికింది! నారు వేసిన వాడు మరి నీరు పొయ్యడూ! అంతా దైవమహిమ!!! ★

# సినిమా దిష్టానికి

"గంగమ్మ తల్లికి శెంగల్వ పూదండ,
కాలిందికీ తెల్ల కల్వదండా॥
గోదావరి తల్లికి గొజ్జంగి పూదండ,
సరసోతికీ సన్న జాజిదండా॥"

కూనిరాగం తీస్తూ నాయనమ్మ బియ్యపు చేట ముందు పెట్టుకు కూర్చుంది పెద్ద తమ్ముడి పోట్లాటలతో, చిన్న చెల్లెలి ఉత్తుత్తి అలకలతో, పసివాడి రోదన ధ్వనులతో గందర గోళంగా, పెళ్లియిల్లులా వుండే మా యిల్లు ఆ రోజు యెందుకో ప్రశాంతంగా వున్నది ఏడ్చి యేడ్చి చిన్న వాడు అప్పుడే అమ్మ ప్రక్కలో పడుకుని నిదురపోయాడు పెద్దతమ్ముడు బడికి వెళ్లాడు చిన్న చెల్లెలు పొరుగింటి చెలితో ఆడుకోవటానికి కామాలు వెళ్లింది

నిశ్శబ్దమయిన ప్రశాంతతకి వాచి పోతున్నాను, యిన్ని రోజుల నుంచీ చావిట్లో యీజీ చైరులో కూర్చుని పుస్తకం తెరిచాను

"కిష్ట యేణమ్మకి చేదంగి పూదండ,
కావేరికీ చంద్రకాంతి దండా॥"

నాయనమ్మ కంటినుస్తా చేస్తున్నది పాటను ఏ మాత్రం సంస్కారం కానీ, రాగ జ్ఞానం కానీ లేని నాయనమ్మ పాటలో, భావంలో, రాగంలో—ఎంత మాధుర్యం! సంగీత జ్ఞానం యే మాత్రమూ లేదు నాయనమ్మకి ఏ స్థాయిలో యే విధంగా గొంతు వొణికించాలో, యే రాగానికి యే తాళం సరిపోతుందో ఆమెకి కొంచమైనా తెలీదు ఆ జానపద గీతం రచించిన ఆ పల్లె హృదయానికి వ్యాకరణం అంటే యేమిటో తెలీదు పోతే—గణ, యతి, ప్రాసల పేర్లు ఆ పల్లె కవి యే నాడూ విని వుండడు ఏదో మహత్తరానుభూతిలో, యేదో భరించలేని పరమానందం కలిగిన సమయంలో—ఆ హృదయంలోనుంచీ, ఆ పాట సహజంగా వచ్చి వుంటుంది అంతే! అయినా, ఆ పాటలో యెంత తియ్యదనం! జోకొట్టి నిద్ర పుచ్చుతున్నది

జానపద గీతామాధుర్యం నుంచి పుస్తకంలో లీనమయినాను మెల్లి మెల్లిగా అంతా స్వప్న జగత్తులో విహరిస్తున్నట్లే తోస్తున్నది

వాస్తవ ప్రపంచంనుంచీ యెంతో దూరం వెళ్లిపోయాము కవీ, నేనూ కొంత సేపు తెలిమబ్బుల్లో, చుక్కల కాంతుల్లో, కొంతసేపు కడలి పొంగుల్లో, యిసుక తిన్నెల్లో, కొంత సేపు సెలయేటి వంపుల్లో, అడవిపూల పరిమళాలలో తేలి పోయాను కవి చిత్రించిన చిత్రలోకం లోకి చొచ్చుకుని పోయినాను నీలిమబ్బులకు స్వర్ణరేఖలు అంచులు దిద్దుకుంటున్నవి సంధ్యారుణ కిరణాలు మెల్లిగా ప్రాకుతున్నవి ఆకాశంమీదకు నాయనమ్మనూ, వంటయింటినీ పూర్తిగా మరిచిపోయి గగన వీధుల్లో తేలిపోతున్నాను మహానంద సాగరాల అగాధపు లోతుల్లో తొంగి చూస్తున్నాను

ఇదే శాశ్వత ప్రపంచమైతే? ఇంత అందాన్ని, పవిత్రతని, మానవులకు అంద

## శ్రీమతి వేదవతీదేవి

రానిదిగా, అతిలోకంగా-సృష్టించాడేమి భగవంతుడు? మన యెదుటనే యింత అద్భుతమయిన అందాలు రాసులు పోసుకుని ఇంద్ర చాపాల్లో, పశ్చిమాకాశపు సువర్ణ రేఖల్లో, కుప్పలై కూర్చుండగా-చూడలేమెందుకు? మలయ మారుతపు సౌరభ్యాల్లో, గంగతరంగిణీ మృదుస్వరాల్లో-వెల్లువలై పోతున్న-రామణీయకాలను, ఒదిలిపెట్టి, నాలుగు గోడలమధ్య కృత్రిమ ప్రపంచాన్ని కల్పించుకుని,-యేమి సుఖం అనుభవిస్తున్నాం మనం? దైవం అన్నీ సృష్టించి కూడా, మనకు యింత సంకుచిత బుద్ధినిచ్చి, మాయ తెరల్లో దింపుతున్నాడెందుకు?

కోకిల మధురా రావాల లోకన్న, పని వాళ్ళ రోదనధ్వనుల్లో ఆనందమున్నదేమి? సహజమైన, వాస్తవమైన విశాల విశ్వంకన్నా, రాతిగోడలతో మూసుకు పోయిన దొరబంగళాలలో అందమున్నదేమి? పక్వమయిన, పరిపూర్ణమయిన, మధుర ఫలాలలోకన్న, శెనగపిండి పకోడీలలో రుచివున్నదేమి?

ఉదయం లేచినదగ్గరనుంచి, మగవాడైతే, బయట ప్రపంచంలోకి వెళ్లి, ప్రొద్దస్తమానమూ తల పగలకొట్టుకు నేటంత పని చేసి చమటతో, అలసటతో-యింటికి చేరటం మామూలు దినచర్య ఆడదయితే అంట్లుతో మొదగ్గరనుంచి సమస్తమయిన అడ్డచాకిరీ చేసి, పిల్లల పోషణ చేసి చేసి, విసిగి వేసారిపోయి, సుఖమెరుగని జీవితానికి అలవాటయి పోతుంది సృష్టిలో యెంత అందమున్నదో, యెంత గల్లదవమున్నదో కనీసం ఆలోచించటాని కూడా తీరిక వుండదు వారికి ఇంకా, దేవుడు మేలు చేస్తే, యిరుగింటి విషయాలూ, పొరుగింటి విషయాలూ-కథలుగా, కథానికలుగా, వర్ణించి చెప్పుకోవటానికి కొంత కాలం భద్రం చేయగలరు (నేను *Excep, tion* అని చెప్పను ఆగ్రహించకండి) శాస్త్రకవి అయితే, సామాన్య ప్రజానీకం చూడని, చూడటానికి ప్రయత్నించని సుందర ప్రపంచాన్ని సృష్టించి లోకానికి అంకితమిస్తాడు చిత్రకారుడయితే కుంచెతో యెన్నో మధురభావాల, యెన్నో రమణీయదృశ్యాలు చిత్రవిచిత్రంగా సృష్టించి ప్రపంచానికి సమర్పిస్తాడు కాని మనకు అవన్నీ తుణీకొనందాన్ని యిచ్చేవిగానే వుంటాయి మరు నిముషంనుంచీ డబ్బూ, వ్యాపారమూ,

పిల్లలూ, ఉద్యోగాలూ-మన లోకమే మనకు!

స్వప్న జగత్తులో వున్న నాకు వినిపించింది ఒక కేక కోకిలారావం కాదు నాయనమ్మ కేక.

"అట్లా యెప్పుడూ పుస్తకం పెట్టుకు కూర్చుంటే పని యెట్లా అవుతుందే? అయినా ఆడపిల్లలకు చదువూ, పుస్తకాలూ యేమిటమ్మా చోద్యం? మానాడు మేమేమీ యెరగం తమ్ముడు యిందాకనగా తిండికి వచ్చి కూర్చుంటే వాడి అతీగతీ చూడవాయెను వాడు చదువుకుంటున్నాడంటే వాడు మగబిడ్డాయెను నీవుకూడా తగుదునమ్మా అని పుస్తకం పెట్టుకుని కూర్చుంటే యెట్లా చెల్లుతుంది?"—దవడలు నొక్కుకున్నది నాయనమ్మ

భావ ప్రపంచపు మత్తు యింకా వదలనే లేదు నాయనమ్మ మాటలు బాగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ అర్ధనిమీలిత నేత్ర నయినాను

"ఆ! అయ్యొ అయ్యో! ఆకళ్ళేమిటమ్మా! మూయకుండా, తెరవకుండా అదేమి చూపే? ఎన్నడూ లేనిది యివాళ యిదేమి చోద్యమమ్మా? ఏమయినా పైత్యంచిందా యేమి పాపమో! పలకనన్నా పలకదాయె నేనేం చేతునమ్మా!"—నాయనమ్మ అరుస్తున్నది

కవి తీసుకుపోయిన యే దివ్యలోకాల్లోనో విహరిస్తున్న నాకు యీ పొలికేకలు ములుకులవలె గ్రుచ్చుకున్నవి నాయనమ్మ వాక్ప్రవాహానికి అడ్డుకట్టవలెనని చేతులు అడ్డంగా త్రిప్పుతూ,

"దిగిరాను, దిగిరాను, దివినుండి భువికి"—సన్నగా, మధురంగా రాగంతీశాను

నాయనమ్మ చేతిలో చేట జారిపోయింది కనుగ్రుడ్లు నిశ్చలంగా వుండిపోయాయి ఆముఖం యెంత తమాషాగా వున్నదో చెప్పలేను గుండెలు బాదుకుంటూ,

"అయ్యో నాయనో! పిల్లకి యేదో పట్టుకుందర్రా! దెయ్యమో పిశాచమో నేనేం చేతునే తల్లీ! ఆమాట లేమిటి? ఆ పాటేమిటి? మొత్తుకున్నా వాటికి అర్థం తెలవక పాయె! అసలు పిల్ల కళ్లు అట్లా తేలవేస్తున్నదేం?"

అన్నానికి వచ్చిన తమ్ముడూ, ఉలిక్కిపడి లేచివచ్చిన అమ్మా, పొరుగింటి రామాయమ్మఅంతా-చేరారు నాచుట్టూ ఈ గందరగోళానికి నాసుందర భావ ప్రపంచం దూరంగా తొలిగిపోయింది. మయూర నృత్యాలూ, మబ్బు తెరలూ, మలయ మారుతాలూ-నన్ను అడక్కుండానే శలవు పుచ్చుకున్నవి

"ఏమిటే మీ గోల?"—అన్నాను తెప్పరిల్లి

"ఇంతకు ముందు నీవన్న మాట యేమిటే? ఏమిటో 'దిగిరాను' అంటా వేమిటి? ఎక్కడనుంచి దిగిరవు? ఏమిటి కథ?" అన్నది నాయనమ్మ గ్రుక్క త్రిప్పుకోకుండా

అప్పటికి కాని అర్థంకాలేదు సంగతి

"అదా, నాయనమ్మా! దివినుండి భువికి దిగిరానన్నాను పుస్తకం చదువుకూ వుంటే స్వర్గంలో వున్నట్లుగా వుందంటే నమ్ముతావు? ఆ స్వర్గంలోనుంచీ మళ్ళీ మన మామూలు ప్రపంచంలోకి దిగిరావాలంటే యెంతో కష్టంగా వుండి అట్లా అన్నాను నాయనమ్మా!"

"ఏడ్చినట్లే వుంది తెలివి! ఎంతపని చేశావూ! చదివి చదివి పైత్యం ప్రకోపించింది కామాలు! అందుకే ఆడవాళ్ళకు చదువు వద్దన్నది వెనకటి వాళ్లు ఎక్కడకో వెళ్లిందట! అక్కడనుంచి దిగిరాదట! ఇక్కడ బ్రతికి వుండగానే ఎక్కడకో పోవట మేమిటి? సరే కాని, వేషం కట్టిపెట్టి, లేచి తమ్ముడికి అన్నం పెట్టు పొయ్యిమీద పాలు వున్నాయి తోడంటు వేసిరా, బియ్యం ఏరుదూగాని"—నాయనమ్మ చేట ముందుకు లాక్కుని ఉస్సూరంటూ చతికిలపడ్డది

తమ్ముడూ, అన్నమూ, పొయ్యీ, తోడంటూ—ప్రపంచంలోకి అమాంతంగా ఒక్కసారి వచ్చేశాను నీలాకాశపు అందాలను వదలిపెట్టి, సుధాచంద్ర చంద్రికాజ్యోత్స్నలను అడుగకుండానే శలవుపెట్టి—దివినుండి భువికి జారిపడ్డాను!

★

"ఏమిటండీ అసలు మీలో బాధ? ఎందుకు స్తమానం ఆడపిల్లల గురించే మాట్లాడుతారు? మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు మేమూ మాట్లాడుతాం వాళ్ళని గురించి కాని ఇరవై నాలుగు గంటలూనా? ఎవరైనా ప్రేమిస్తున్నారా?"

వామనాచారి కంగారుపడ్డాడు-"నువ్వు పొరపాటుపడ్డావు" అన్నాడు. "నేను నీతో కనక ఈ విషయాలన్నీ మాట్లాడుతున్నాను కాని ఇంకెవళ్ళతోనూ ఈ విషయాలు మాట్లాడను అదేనా నువ్వు నాకు అప్పుడివికనక నువ్వే చెప్పు నే చెప్పదేనా క్లాసులో అల్లరి చెయ్యటం చూశావా? నాకలాంటి దురుద్దేశాలున్నాయా? నాకు కేవలం మన కాలేజీ అమ్మాయిలంటే సోదరప్రేమ. అంతా నాకు అక్కలు చెల్లెళ్లు. హృదయం పవిత్రంగా వుండాలి కాని స్త్రీ గురించి మాట్లాడితేనేం పురుషుణ్ణి గురించయితేనేం? ఇంతకీ ఈ వేళ మన ఆడపిల్ల లెంతేశారో తెలుసా "

వామనాచారి తలకి పట్టిన వెర్రిలో అగ్నిపర్వతంమీద నిలబడ్డాడని నాకు పూర్తిగా నమ్మకం కుదిరింది ఇంక అతన్ని మార్చటం బ్రహ్మతరం కాదని నాకు చాలా జాలేసింది

* * *

ఒకసారి ఏదో చందాల విషయంలో మరో విద్యార్థితో కలిసి ఆడపిల్లల హాస్టలుకి వెళ్లాల్సొచ్చింది నాకసలు ఎన్నాళ్లనుంచో ఆతురతగా వుంది— వీళ్ళెలా మాట్లాడుతారు? గౌరవంగా మాట్లాడుతారా? వీళ్ళ ఆలోచనలస్థాయి ఏమిటి? వచ్చిన అవకాశం పాడుచేసుకోవటం మంచిదిగా తోచలేదు

కుర్చీల్లో కూలబడ్డాం మావాడు నిమిష నిమిషం జేబురుమాలుతో ముఖం తుడుస్తున్నాడు నాకూ లోపల ఖంగారుగానే వుంది ఏమైనా మాట్లాడే బాధ్యత అంతా వాడిమీదే వదిలేశాను కనక కాస్త ధైర్యంగానే కూర్చున్నాను

"ఏమండి" అని మా వాడు కాస్త చిరునవ్వుగా అనటంతో ప్రారంభమయింది సంభాషణ టైము నాలుగున్నర

సమాధానం, "ఏమండీ," అంటే వచ్చేరా అని అర్థం

రెండో ఘట్టం "ఎలా చదువుతున్నారు?"

"ఎలాగో మోస్తరుగా మీరు?"

"ఏమిటోనండీ ఏమీ అర్థం కావటం లేదండీ క్లాసుకి రావటానికి, ఇంటిదగ్గర నిద్రోడానికే సరిపోతోందండీ టైముం తాను?"

సంభాషణలు దొర్లాయి టైముతోబాటూ కాలేజీ మేష్టర్ల గురించీ, సినిమాల గురించీ అన్నింటి గురించీ మహాఆశ్చర్యం ఏమిటంటే, నాతో ప్రతీ విషయ్య గంటలు గంటలు వ్యతిరేకించి మాట్లాడే మా వాడు వాళ్లు చెప్పింది ప్రతీదీ రెట్టించి "ఔను" చెయ్యటం

"నర్గీస్ బాగా నటిస్తుంది" అని వాళ్లంటె,

"ఔను చాలా బాగా నటిస్తుంది" మా వాడు

"సురయా అంతకన్న బాగా నటిస్తుంది"

"ఔనౌను నిజంగానే అంతకన్న చాలా బాగా నటిస్తుంది"

"వస్తున్న సినిమాల్లో సంగీతం బావుటోంది"

"ఔను అన్ని సినిమాల్లో సంగీతం బాగా అద్భుతంగా వుంటోంది"

"కాని అన్నీ వట్టి చెత్త"

"కేవలం చెత్తేననుకోండి"

ముక్కు పట్టుకు ఎలాపడితే అలా నడిపించే శక్తి వాళ్లలో ఉందేమో మనకనవసరం కాని, వ్యక్తిత్వం, ఆత్మగౌరవం, అభిమానం గురించి గంటలకొద్దీ లెక్చర్లు కొట్టే మా వాడు వాడి వేదాంతాన్నంతా వదిలి వాళ్లన్నదాన్నల్లా అలా సంతోషంతో ఎగిరి కేరింతాలు కొడుతూ బలపరిచే ఈ దౌర్బల్యం, అంత ఖర్మం బట్టిందో నాకు అర్థం కాలేదు టైము ఆరున్నర

కొంతసేపు వాడినీ వీడినీ తిట్టపోశం అయింది ఇంతకీ నేను పెట్టుకున్న ఆశలేవీ పూర్తి కాలేదు ఏ విషయమైనా సీరియస్‌గా మాట్లాడుతారేమో నన్న ఆశ పోయింది ఏదో పిచ్చపాటి, నవ్వులూ, గోలాకూ వీళ్లు జీవితంలో దేన్ని సీరియస్‌గా తీసుకొంటారో అర్థం కాలేదు నాకు ఈ తిట్లపాగంలోనే వచ్చాడు మా వామనాచారి

ఇందాకటి నుంచీ అతన్ని కనిపెడుతూనే వున్నాను గేటు అవతల ఇటూ అటూ తిరుగుతున్నాడు కాళ్లెత్తి పైకి చూస్తున్నాడు మధ్య మధ్య-ఎవరు లోపల మాట్లాడుతూన్న అదృష్టవంతులని నాకు గుండెలు జారేయి ఇంటికెళ్లేక ఈ నాటి నాటకం అంతా అతనికి చెప్పచెప్పాలిరా దేవుడా అని లేకపోతే నాకింక నిద్రపోయే యోగం వుండదు

ఇంతలో ఒకామె అన్నది "ఆ వామనాచారి వున్నాడేం మా ప్రాణం తీసేస్తున్నాడు షికారు పోతే వెనకపడతాడు అలా చూడండి చీకటి పడేదాకా అలా తిరుగుతూనే వుంటాడు ఏమిటీ అతని వుద్దేశం?"

"సినిమాలో మరి అతని పుస్తకం కోసరి వాళ్ళకేమిటండీ" మా వాడు

"మొన్న కాలేజీనుంచి వస్తూ పుస్తకాలు పోయించాను" ఫకాలుమంది మరొకామె

ఇంకో ఆమె అన్నది "గొడ్డు మాపులూ కాదూ పశువులాగ ఎలా చూస్తాడో"

"ఇతనింటి పక్కనే అతనిల్లు" అన్నాడు మా వాడు నన్ను చూపిస్తూ

"బాగా చివాట్లు పెట్టగాదూ?" అందామె తన బాధ్యత నాకు అప్పగించేస్తూ మరో చిత్రం కనిపెట్టాను మా వాడు నేను వాళ్లతో మాట్లాడే అవకాశాన్ని సంపాదించేస్తానేమోనని భయపడుతున్నట్లు, వాళ్ళనోటమ్మట మాట జారిపడకుండానే సమాధానమిచ్చేస్తున్నాడు టైము ఏడున్నర!

నాకు ఆకలి దహించుకు పోతోంది ఈ లేమన్ మెతుకులు తింటూ ఇలా గంటలు గంటలు నాకు మతి పోతోంది మా వాడు అన్నాడు

"ఇంక టైము పోయింది వెళ్తాం" నా పై ప్రాణాలు పైకి పోయినాయి అసలు వచ్చిన పని కాలేదు నా జేబులో చందా పుస్తకాలు తీశాను దీని మాటేమి చేశావని

"మీరంతా తప్పకుండా విరాళాలివ్వాలి పూర్తిసహకారం కోరుతున్నాం" అంటూ రెండు పుస్తకాలు వాళ్ళకిచ్చాడు దీనికి ఇంతకీ వచ్చిన పనికి పట్టింది నాలుగు నిమిషాలు

మా వాడు వస్తూ వస్తూ అన్నాడు "మళ్ళీ ఎప్పుడైనా వస్తాను లెండి"

వాళ్లు ధన్యనందే! అతని వెనకాలే బయలుదేరాను టైము ఎనిమిది

నా ప్రశ్న మాత్రం ప్రశ్నగానే వుండిపోయింది

దారిలో మా వాడితో సంభాషణ మొదలు పెట్టా "మనం వెళ్లినపనేమిటి! ఈ వాగుడంతా ఏమిటి నువ్వు? నాతో సినిమాలగురించి వాగిందీవన్నీ వట్టి కొత్త అన్నావాడివి, సురయ్య, నర్గీస్‌ల బొధలన్నింటికీ ఊం కొట్టడమేమిటన్నాను

"ఒరేయ్" అన్నాడు "నీకు తెలియని విషయాల గురించి నువ్వు నోరు మూసుకో ఆడపిల్లలో ఎలా మాట్లాడాలో ఏమి మాట్లాడితే బాగుంటుందో నాకు తెల్సు వాళ్లతో పొద్దు గడపాలంటే వాళ్లు చెప్పిన దానికంతా ఒప్పుకోవాలి వేటినీ కాదనకూడదు" అన్నాడు నేనన్నాను "నువ్వు పొరపాటు పడుతున్నావ్ మన దేశంలో కాలేజీల్లో చదువుతూన్న ఆడపిల్లలెంతమంది? దేశంలో చదువురాని ఆడవాళ్ళని ఎల్లా చూస్తారు? అతి అంటే, నియమం అంటే ఏమిటి! వీళ్లు ఈ నాటి ప్రపంచం నుంచి నేర్చుకుంటున్న పాఠాలేమిటి? వీళ్లు కేవలం గాలి మేడల్లో నివసిస్తున్నారా? చుట్టూ ప్రపంచం గురించి తెలుసా? అంత కొత్త మాట్లాడినా గంట సేపయినా వాళ్లకుంటే కొద్ది అవకాశంలో ఎంతో మందికి ఈ రోజు లభించని తమకిమాత్రమే లభించిన ఈ అవకాశాన్ని వినియోగించుకో రాదూ? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం దొరుకుతుందనుకున్నా పోనీ వాళ్లు ఆలోచించరు అది వాళ్ల లోటు అంతే కాదు తప్పంతా వాళ్లది కాదు గంటలు గంటలు అలా లెక్చర్లు దంచే మీరంతా కొత్తవాడుతూ, వాగుతూంటే తల ఊగిస్తూ పోతే వాళ్ల ఖాళీ బుర్రలకి కొది ఆలోచన లివ్వరాదూ? నీ వాదనలన్నీ నా దగ్గరా? అక్కడకుపోయి చేసేవన్నీ వెర్రి అర్థంలేని సంభాషణలా?" నాకు ఆవేశం ఆగలేదు "నీలాంటి వాళ్ళే నిజంగా ఈ అసహన వాతావరణానికంతకీ కారణం"

మా వాడు నన్ను పంథొమ్మిది వందల పధ్నాలుగు పద్దెనిమిది మనిషివన్నాడు నేను కాలాన్ని బట్టి నడుచుకోవటం లేదన్నాడు అసలు నాకు "స్త్రీ" అంటే అర్థం తెలీదన్నాడు

ఇంతకీ వామనాచారి అంటే ఇదన్నమాట వీళ్ళ అభిప్రాయం ఎంత మేలయిందో చూశావా ఈ వేళ" అన్నాడు మా వాడు వాడి కళ్లల్లో సంతృప్తి మెరసింది

దారిపొడుగునా నా ఆలోచనలన్నీ వామనాచారిమీద వున్నాయి ఇంత నీచంగా అతన్ని గురించి అనేటంత పరిస్థితి దిగజారిందా? పుస్తకాలు పోయిస్తే జీవితం ధన్యం అయినట్లు భావించాడేమో!

ఇల్లు దగ్గర పడుతూంటే వామనాచారి ఇంట్లోంచి పకపకలు వినిపిస్తున్నాయి అరడజనుమంది చేరినట్లున్నారు కాళ్లు అప్రయత్నంగా వాళ్ళ దగ్గరకు ఈడ్చుకు పోయాయి గది గుమ్మంముందు నిలబడి లోపలికి చూశాను ఎవరూ నావైపు చూసేటంత తీరుబడిలేకుండా వున్నారు

వామనాచారి ఏదో చదువుతున్నాడు

" నీకోసం ఈ నాగుండెల్లో బాధ నిద్రరాని ఈ వెన్నెల రాత్రులు ఆహా! ప్రాణప్రియా నీకోసం కంటున్న ఈ కలలు ఎప్పటికి నిజమవుతాయో గదా!

గొల్లుమన్నారంతనూ బావుందంటే బావుందన్నారు "వామనాచారి బలే కవిత్వం రాస్తాడురోయ్" అన్నాడొకతను

వామనాచారి మళ్ళీ చదువుతున్నాడు

"ఈ సంఘం గుడ్డిది ఈ ప్రపంచం కేవలం మోసం నువ్వూ నేనూ, నీలి మేఘాల ఆకాశం చంద్రుడు, నక్షత్రం రెండుపద్మాలు నీ ఆజ్ఞకోసం ఈ దాసుడు ఎదురు చూస్తున్నాడు నువ్వు ఒక్కసారి నవ్వి ఒక్కసారి చిన్న మాట మాట్లాడితే ఈ విరహాగ్ని చల్లార్చి నీ పాదసేవకుణ్ణి చేసుకో మాటలతో ఏం ప్రయోజనం నీవు లేందే జీవించలేను"

అందరూ చప్పట్లు చరిచారు "చివరికి సంతకం పెట్టావా!" అన్నాడొకడు

'వుట్టి 'ప్రియుడు అని వ్రాయకున్నాను

"ఎప్పుడు పోస్టుచేసావ్?" అన్నాడు మరొకడు

"ఇప్పుడే" అన్నాడు వామనాచారి

"సంతకంకూడా పెట్టేయ్" అన్నాడింకో అతను"

"ప్రిన్సిపాల్‌తో చెప్తే " అన్నాడు కళ్ళల్లో భయం మెరుస్తో!

"ఇంతేనా నీ ప్రేమ ?"

"తమాషాకోయ్ ఇదంతానూ" గది ఎర్రలయింది వామనాచారి నవ్వుతో లోపలికి వెళ్ళాను ఎవరూ మాట్లాడలేదు వామనాచారి ఉత్తరాన్ని మెల్లెంగా పుస్తకంలోకి తోశేశాడు అంతా నెమ్మదిగా జారుకున్నారు ఆచారి గదిలో ఒదిగిల బడ్డాడు

"నీదంతా సోదరీ ప్రేమ అన్నావ్ ఇలా దిగిందేం ?" అన్నాను

"ఏరా ?" అన్నాడు తెల్లబోయి "ఓ అదా! అదే, అదేదో కథ రాస్తున్నానులే! అయినా అది నాకేం నచ్చలేదు. చింపేస్తున్నా" కాగితం ముక్కముక్కలయింది

"అయితే నేను ప్రేమించకూడదా ?" అన్నాడు కొంచెం ఈర్ష్యగా నేను సమాధానం చెప్పలేదు "బాగానే వుంది కాని, సంతకం పెట్టడానికైనా ధైర్యం లేనివాడివి, వుత్తరం ఎందుకు వ్రాయడం ?" అన్నాను

"మీతో చెప్పాల్సిన అవసరం లే" దన్నాడు నువ్వు, మీరుగా మారటంలోనే ఆచారికీ నాకూ మధ్య అగాధం ఏర్పడింది నాకు

కోపంగానే అన్నాను "వామనాచారిగారూ! మీరు ప్రపంచజ్ఞానం ఏమాత్రంలేని వాళ్ళల్లా కనిపిస్తున్నారు నిన్న వాళ్ళు 'గొర్రు' అంటున్నారు తెలుసా ? ఎందుకలా చూస్తారు నాకేసి ? మీరు ఎదుటివాళ్ళ మనోభావాలు కనిపెట్టలేని వారు ధైర్యంలేని అభిప్రాయాలు లేవు జీవితం అంటే పోట్లబిళ్ళలేని కవరు అనుకుంటే, సంతకం లేని ఉత్తరాలనుకుంటే మీరెంతదూరం వెళ్ళగలరో నే వర్ణం చేసుకోగలను మీ సోదరీ ప్రేమ చివరికి ఈ వెర్రి తలలేసింది చివరకి ఏమయ్యారో తెలుసా మీచూపులు గొడ్డుచూపులున్నూ, మీరు పశువున్నూ అయ్యారు" వినిపించాలని మరింత గట్టిగా అన్నాను "ఇది మన క్లాసు ఆడపిల్లల అభిప్రాయం తమర్ని గురించి "

అతనలా నోరు వెళ్ళబెట్టి కుర్చీలో కూలిపోయాడు

వామనాచారిలో బ్రహ్మాండమైన మార్పు వచ్చిందనుకుంటే చాలా పొరపాటు ఇది జరిగిన కొన్నాళ్ళలోనే అతనికి క్రొత్త స్నేహితులు దొరికేరు ఎవరని చూదునూ, ఇదివరకు ఇలానే ఏదో ఘర్షణలో ఆడపిల్లల్తో దెబ్బలాటలు పెట్టుకున్న అసంతృప్త జీవాలన్నీ వామనాచారి వాళ్ళలాగే గళ్ళరుమాళ్ళు కొలగుచుట్టూ కడుతున్నాడు తమాషా ఈలలన్నీ అలవాటు పడ్డాయి వాళ్ళంతా తమ కసితీర్చుకుందుకు వామనాచారిని వాళ్ళ చేతుల్లో తోలుబొమ్మను చేసుకున్నారు వామనాచారిలో వెర్రిధైర్యం వచ్చింది వెకిలి వెకిలి మాటలు మాట్లాడటం, కన్నుగీటటం, కొద్ది వారాల్లో పాత వామనాచారి కాదుఅతను

కథలుమాత్రం చెప్పకునేవారు అతన్ని చెప్పు దెబ్బకొట్టిందో అమ్మాయి అని ఇంకా ఇలాంటివి నాకుమాత్రం నమ్మకం లేదు కొందరు అమ్మాయిలు చూసీ చూడనట్లు పోతారు కొందరు లోపల తిట్టుకుంటారు కొందరు కొంతదూరం పోయినా భయపడి వెనక్కి తిరుగుతారు ఓటమి మాత్రం ధైర్యం ఏమాత్రం లేని అనేకమంది కాలేజీ అబలలదే జీవితం వాళ్ళకి నేర్పే పాఠాలేమీ లేవు వాళ్ళు నేర్చుకోరు కనక. నేర్చుకుందుకు ప్రయత్నించరు కనక కృత్రిమ ఆనందాల్లో జీవితాన్ని చవిచూడబోయి, నిరాశ పొందిన, అంతా జీవికయని ఆ ఎండమావుల్లోనే నీళ్ళు తాగుతారు కనక

వామనాచారి నాచేతుల్లోంచి జారిపోయాడు చివరకు నాలో మిగిలింది జాలి అతనికి ఆత్మసంతృప్తి వుందా ? నేను నమ్మను ఆ వేదన, బాధ, తీరని తపన

అతనికి ఇప్పటికీ అర్థంకాని ప్రశ్న: "ఇంత నేను ప్రయత్నంచేసినా, ఒక్కమ్మాయి నావెంట బడదేం "

అతనికి వొక్కటే సమాధానం "జీవితం విలువ నీ వనుకొన్నంత తేలిక కాదు నువ్వు జీవితాన్ని వెక్కిరించబోయావు స్త్రీ అంటే నీదృష్టిలో ఏదో ఆటబొమ్మ నీమార్గం సరళం కాకపోబట్టి నీకు దేనికీ ధైర్యంలేక పోయింది సత్యానికీ, నీహృదయదౌర్బల్యానికీ జరిగిన యుద్ధంలో పాఠం నువ్వు నేర్చుకోలేదు జారిపోయావ్ ఇంకా జారిపోతావ్ స్త్రీ కాని పురుషుడుకాని ఎప్పుడైనా కాళ్ళు జారతారు జారతారు మనుష్యులు కాబట్టి కూడగట్టుకోరూ ? యవ్వనాన్నీ, జీవితాన్నీ వేరువేరుగా బలిపెడితే చివరకి మిగిలేది అసంతృప్తి అదే నీఓటమికి కారణం "

అతను పరీక్ష పాసయ్యాడో లేదో నాకు తెలీదు నా కనవసరంకూడా జీవితపు పరీక్షలోమాత్రం అతను ఎప్పటికీ పాసు కాడని, ఈనాడు కాలేజీల్లో చదువుతున్న వాళ్ళల్లో వేలకొద్ది అబ్బాయిల సాక్షిగా, జీవితం అంటే ఎప్పుడూ ఆలోచించటానికేనా టైములేక బాధపడుతున్న ఆడపిల్లలసాక్షిగానూ చెప్పగలను. ★




# తెలుగుబాల ★

శ్రీ మానేపల్లి సంగవేశ్వరకవి

౧
శ్రీలనొసగీ, మేలునొసగే
పాలబుగ్గల పసిడిబాల!,
పూలకలిమీ తెలుగుదేశం
ఏలుకో చిన్నారిబాల!!

౨
పచ్చపచ్చని భూములెల్ల
పైరులై బంగారుపండ
నిల్చి, ప్రకృతి జోతలొసగ
రాల్చరా రతనాల నవ్వులు! ..

౩
కోడెదూడల నీడలాడే
పాడి, పంటల భాగ్యరాశి! ,
వాడిపోవని తెలుగుపూల
మేడలో పారాడు బాల!! ...,

౪
కోసినవ్వుల భువనమోహన!
కాసులా వరహాలనాన్న!!,
వాసికెక్కిన తెలుగుజ్యోతి,
వన్నెలా చిన్నారిమహాతి!!.,

౫
తెలుగుత్యాగయ దివ్యగానం,
తెలుగు బ్రహ్మయ దేవతత్వం,
తెలుగుతిక్కన తేటకవితా
తేజముల్ నీపూజ ఫలములు!...,

౬
ఆణిముత్తెపు సరులతీరూ,
ఆంధ్రయక్షర పంక్తి బారూ!,
వీణపాడినయట్లు వినగా
వీనులకు నీతెలుగు భాష!!,

౭
చందమామకు జ్ఞాతివై!, మా
మందిరములో జ్యోతివై!!., ఆ
నంద చందనసౌరు ముద్దుల
విందులిచ్చే యాంధ్రబాల!!!

# ★ పక్షులు ★




పికిలిపిట్టను బుల్బుల్ అని కూడా అంటారు ఈ పిట్టలలో చాల రకాలున్నాయి కొన్ని ఆకు పచ్చనివి, కొన్ని బూడిద రంగువి, కొన్ని గోధుమరంగువి వీటిలో గోధుమరంగు పిట్టలు ముఖ్యమైనవి ఎందుకంటే ఇవే సంగీత శబ్దాలు చేస్తాయి దీని కూత ఎప్పుడూ ఉల్లాసంగా, మనోరంజకంగానే వుంటుంది. ఎక్కువగా తోటల్లో, చల్లటి ఆకుల నీడల్లో నివసిస్తుంది ఇళ్ళలోకి కూడా వచ్చి గోలచేస్తాయి ముఖ్యంగా కాశ్మీరంలోని శ్రీనగర్‌లో ఇవి ఎక్కువ కనిపిస్తాయి కాశ్మీర కవులు బుల్బుల్ పిట్టలమీద రాసినన్ని పాటలు మరే పక్షులమీద రాయలేదు ఈ పిట్టలు మార్చి, సెప్టెంబరు నెలల మధ్య గుడ్లు పెడతాయి ఎండు పుల్లలను తెచ్చి పచ్చగడ్డి, ఆకులు మొదలైనవి చేర్చి దొన్నెలాగా గూళ్లు కడతాయి తడవకు మూడు లేక నాల్గు గుడ్లు పెడతాయి

## భరద్వాజపక్షి

భరద్వాజపక్షి చూట్టానికి ఆడపిచ్చిక మోస్తరుగా వుంటుంది గోధుమరంగు దీన్ని ఇంగ్లీషులో "స్కైలార్క్" అంటారు ఇది ఎక్కువగా పచ్చిక మైదానాల్లోను, చెట్లు ఎక్కువగా లేని కొండప్రాంతాల్లోను కనిపిస్తుంది జంటలుగాను, కుటుంబాలుగాను, అరుదుగా గుంపులుగాను కూడా తిరుగుతాయి నేల మీద గింజలనో, పురుగులనో ఏరుకుని తింటాయి చూట్టానికి అందంగా ఉండకపోయినా, ఈ పక్షి పాటలకు పెట్టిందిపేరు. దీని ధ్వని అతి మధురంగా, ఓ గొప్ప సంగీతం వింటున్నంత అద్భుతంగా వుంటుంది ఆడపక్షి గర్భిణిగా వున్న కాలంలో మగపక్షుల పాట విని తీరాలి ఉదయవేళ, సాయంత్రవేళ మగ పక్షులు నేలమీద ఉన్నచోటనుండే సూటిగా గాలిలోకి ఎగురుతాయి తప తప రెక్కలు ఆడిస్తూ నిటారుగా చొచ్చుకుని పోతాయి అలా ఎగురుతూ, ఎత్తుకుపోయిన కొద్దీ బిగ్గరిగా పాడుతూ కంటికిగాని, దూరదర్శిని యంత్రానికిగాని కనిపించనంత దూరానికి పోతాయి అయినా దానిపాట స్పష్టంగా మనకి వినిపిస్తూనే వుంటుంది అంత ఎత్తుకు పోయాక అక్కడ సుమారు పది నిమిషాలసేపు రెక్కలాడిస్తూ, పాటపాడుతూ, నిశ్చలంగా వుంటాయి మళ్ళీ నేలమీదకి వచ్చేస్తాయి ఆ దిగడంలోకూడా ఒక తమాషా చేస్తాయి రెక్కలు ముడిచి కొంత దూరంవరకూ రాతి బెడ్డవలె పడిపోతాయి మళ్లీ రెక్కలు విప్పి కొంచెంసేపు లఅల్లార్చి మళ్లీ సూటిగా పడిపోతాయి, మళ్ళీ కాసేపు రెక్కలల్లార్చి మళ్ళీ పడిపోతాయి ఈ విధంగా అంచె లంచెలుగా గాలిలో దిగుతూ వస్తాయి ఎక్కడనుంచి ఎగిరాయో అక్కడికే వచ్చి వాల్తాయి ఫిబ్రవరి జులై నెలల మధ్య గుడ్లు పెడతాయి నేలలోనే చిన్న గొయ్యి తవ్వి పచ్చిక పరిచి దానిమీద తడవకు రెండునుండి నాలుగు వరకూ గుడ్లు పెడతాయి



# నాతి తోపులి

"చదువు కోవడం అయిం దన్నయ్యా. ...కథ చెప్పవా?

"ఆ.. బుద్ధిమంతుల లక్షణం అది. నిన్న చెల్లాయి చూశావా పారం రాందే కథ చెప్పమంటూ కూర్చుంది"

"ఇవాళ చెల్లాయికూడా చదువు కుంది అన్నయ్యా అదుగో వస్తూనే ఉంది, పుస్తకాలు గదిలో పెట్టి"

"నిన్న చదువుకో లేదని కథ చెప్ప లేదు. ఇవాళ పాఠాలన్నీ వచ్చాయి కథ చెప్పు పెద్దన్నయ్యా" అంటూ చెల్లాయి పరుగెత్తుకుంటూ

"అవును. ఆ ఖిల్లా యే ఇది. ఆఖిల్లామీద పెద్దపులు, చిఱుత పులులు, సింహాలు, కోతులు, కొండముచ్చులూ ఇంకా యెన్నో మృగాలు ఉంటాయి గంధపుచెట్లు, కొలమలు, నేతికొట్లూ ఉండేవి. బొమ్మల కొలువులో మన చెల్లాయిలు కొండపల్లి బొమ్మలని పెడు తూంటారు చూశావూ అవి ఈ ఊళ్లోనే నకాసాలు అనేవాళ్లు తయారు చేస్తూంటారు. ఇప్పటికీ కొండపల్లి బొమ్మలకి మన దేశం లోనేకాక, ఇతర దేశాలలోకూడా మంచి ప్రఖ్యాతి ఉంది పూర్వం ఆఖిల్లా క్రింద దగ్గరలోనే ఎన్నో

పొలాలు, తోటలూ వున్నాయి. పసువులను మేతకి ఇప్పుడు అక్క డికే తోలుకు పోతుంటారు.

ఒకరోజున ఏమైందంటే, మామూలుగా గొడ్లను తోలుకొని రామన్న అనే కాపుల కుర్రాడూ, అతని నేస్తగాళ్లూ వెళ్లారు. అక్కడ దగ్గిరలోనే ఒక పాడుబడిన బావి వుంది రామన్న ఆ బావి గట్టు మీద కూర్చుని పిల్లంగోరు వాయిస్తు న్నాడు. అతని నేస్తగాళ్లంతా కొం చెం దూరంలో చెడుగుడి ఆట ఆడు కుంటున్నారు ఇంతలో ఒక పెద్ద పులి రామన్నను చూసి, మింగే ద్దామని అమాంతం వాడిమీదికి

## శ్రీ సింగరాజు లింగమూర్తి

వచ్చింది.

"ఆఁ.. అయితే ఒక కథ చెప్తా వినండి"

అంటూ అన్నయ్య చెల్లాయినీ, తమ్ముణ్ణీ చెరోవైపు కూర్చో పెట్టు కొని కథచెప్పడం మొదలుపెట్టాడు

"అనగా అనగా కొండపల్లిఅనే గ్రామం ఉంది ఆగ్రామానికి చేరువ లోనే ఒక పెద్ద గుట్టవుంది దానినే కొండపల్లి ఖిల్లా అంటారు"

"అవునన్నయ్యా'.. మొన్న మాబళ్లో మాష్టారు చెప్పారు ఆఖిల్లా సంగతి" అంటూ తమ్ముడు మధ్యలో అడ్డొచ్చాడు.

ఇళ్లు ఉండేవి. వేసవి కాలంలో చల్లగాలికని అంతా ఆరుబయటనే పడుకొనే వాళ్ళు ఖిల్లామీద వుండే పెద్ద పులులు, చిఱుత పులులు ఈ ఆరుబయట పడుకున్న వాళ్ళ మీదు గానే గంతులు వేసుకుంటూ పోయే విట అయినా ఆపడుకున్న వాళ్ళని ఏమీ చేసేవి కావట. తర్వాత తర్వాత ఆ ఖిల్లాక్రింద వుంటున్న మునలి వారంతా కాలం తీరి పోయాక, పడుచ వాళ్లు అక్కడ వుంటానికి భయపడి, అక్కడి ఇళ్ళన్నీ వదిలేసి ఊళ్లోకి వచ్చి వుంటున్నారు. ఇప్పుడు అక్కడ

దూకింది. బావి గట్టు మీదనే రామన్న ఏమరుపాటుగా పిల్లంగోరు వూదుతూ కూర్చున్నాడు కదూ, పులి మీద పడడంతోనే "అమ్మయ్యో" అంటూ బావిలో పడ్డాడు రామన్నతో పాటు పెద్ద పులికూడా ఆ దూకుడికి బావిలో పడిపోయింది "ఢాం" అని బావి లోంచి పెద్ద చప్పుడైంది. ఆ



# మా సంక్రాంతి కానుక

మూర్ఖపు సిద్ధాంతాల హద్దులలో మెలగుతూ, అధికార దుర్వినియోగం చేసేవారి దర్యలకులోనైన యువతీయువకుల విషాదగాథ!



నటీనటులు

పృధ్విరాజ్, నర్గిస్, రాజ్‌కపూర్, కక్కూ,
K N సింగ్, లీలాచిట్నిస్ లు

★

కథ - కె. ఎ. అబ్బాస్
మ్యూజిక్ - శంకర్, జైకిషన్

★

రాజ్‌కపూరు

# "ఆవారా"

విజయవాడ శ్రీ లీలామహల్
రాజమండ్రి శ్యామలాటాకీస్
కాకినాడ : మినర్వా.

త్వరలో - సరస్వతీ - గుంటూరు
సరస్వతీ - విశాఖపట్టణం

విడుదలకు సిద్ధంగావున్న చిత్రాలు

R పద్మనాభన్ ప్రొడక్షన్సువారి
**రాజేశ్వరి**

★

ప్రతిభా వారి
**చిన్నకోడలు**

# నవయుగ ఫిలిమ్సు

విజయవాడ • గుంటకల్

దూరంలో ఆడుకుంటున్న రామన్న స్నేహితులు ఈ చప్పుడు విని అంతా బావిదగ్గరకు పరుగెత్తివచ్చి, బావి లోకి తొంగిచూశారు పాడుబడిన బావికదూ నీళ్లు పచ్చగా, ఆకు అలములతో వున్నాయి అందులో ఆ బావి చాలా లోతైందికూడా. రామన్న, పెద్దపులీకూడా మును గుతూ తేలుతూ ఉండటం వాళ్లు చూశారు ”

“భలే బాగుం దన్నయ్యా. . రామన్నను చంపేస్తుందేమో పులి.” అంటూ తమ్ముడు మధ్యలో ప్రశ్న వేశాడు

“చెప్తా విను మరీ పెద్ద పులికి నీళ్లతో చెరలాట లాడడం ఎప్పుడూ అలవాటు లేదు. దానికి దాహం వేస్తే ఎంతో జాగ్రత్తగా ఏ చెరువు వద్దనో నిలబడి తాగుతుంది అందులో ఇది లోతైన బావి. పాపం! రామన్నకు మనసులో మనసు లేదు పై ప్రాణాలు పైకే పోతున్నట్లు అనిపించాయి పెద్దపులి గాండ్రుమని అరుస్తున్నది. రామన్న స్నేహితులు బావిలోకి చూస్తు న్నారే కానీ వాళ్లకి ఏం చేయాలో తోచలేదు. పెద్దగా కేకలుపెట్టి అక్కడికి కొంత దూరంలో పొలంలో పని చేసుకుంటున్న వారిని పిలిచారు వాళ్లుకూడా పరుగెత్తి వచ్చారు. ఎవరికీ ఏం చేయాలో బోధపడలేదు వాళ్లల్లో గఫూర్ సాహెబ్ అనేవాడు ఇది వరకు దొరల్తోపాటు తుపాకీతో పులుల్ని చంపడం నేర్చుకున్నాడు.

“ఇప్పుడు బావిలో ఉన్నదాన్ని చంపడం ఎట్లాగా?” అని గఫూర్ సాహెబ్ గడ్డం తడుముకుంటూ ఎంతోసేపు ఆలోచించాడు చివ రికి అక్కడవున్న వాళ్లతో “బావి లోకి తాడువెయ్యండి” అన్నాడు. అందులో ఒక పిరికి దద్దమ్మ “రామన్నకు బదులు పెద్దపులే తాడు పట్టుకొని వస్తే ఎట్లా?” అన్నాడు “నీకి అఖల్ లేదురా ఎంకన్నా! పులి తాడు పట్టోని హెట్లా వస్తాదిరే...నీకి ఫికర్ వుంటే పో—అరే, బావిలో తాడూ దాలో భాయీ, నాకీ ముఖం హేమీ చూస్తార్” అని సాహెబ్ తతిమ్మా వాళ్ళని హెచ్చరించాడు. మొత్తానికి ఎట్లాగైతే నేం ఒక పెద్ద తాడు సంపాదించి బావిలోకి వేశారు

“రామన్నా—నీకీ ఫికర్ లేదూ భాయీ!—అస్సీ ఘట్టీగా పకడో” అని సాహెబ్ కేకవేశాడు

“తాడు పట్టుకున్నా” అని బావి లోంచి రామన్న జవాబిచ్చాడు.

అక్కడున్న పది పదిహేను

**1951 మాడల్**

# బెడ్‌ఫోర్డు ట్రక్కులు

మరియు

## సింగర్, రోవర్, లాండ్‌రోవర్ కార్లు

మా షోరూం స్టాకులలోనుండి డెలివరీకి దొరకును

వివరములకు **గోగినేని బ్రదర్సు ఏజన్సీస్ లిమిటెడ్**

కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలకు

బెడ్‌ఫోర్డు ట్రక్కులకు డీలర్లు

నెల్లూరు, గుంటూరు, కృష్ణా, తూర్పు పశ్చిమగోదావరి, విశాఖపట్నం జిల్లాలకు

సింగర్, రోవర్, లాండ్‌రోవర్ కార్లకు డీలర్లు.

పో॥ బా॥ నెం 72
టెలిఫోన్ నెం 227
విజయవాడ 1.



బ్రాంచి:
టెలిఫోన్ నెం 106
గుంటూరు

**సాంఘిక చిత్రకళా సృష్టిలో ప్రజావాణి మెప్పును పొందగల చిత్రం.**

**త్వరలో!**

**మెజస్టీ ప్రొడక్షన్ వారు సమర్పించనున్న**
**ప్రథమ తెలుగు సాంఘిక చిత్రం**

# అందాలుపెళ్ళి

నిర్వహణ
**స్వామి-పద్మనాభం**

Majesty Production

Mutyam

*For Particulars:* **MAJESTY PRODUCTION.**
*HO. NARSAPUR. W.G.DT.,*

నుండీ తాడు పట్టుకొని లాగలేక లాగుతున్నారు. కొంత పైకి లాగారో లేదో, "ధాం" అంటూ బావిలోంచి శబ్దం విన వచ్చింది. లాగుతున్న వారు క్రింద పడి పోయారు. "అరే.. హేమిటి అయిందీ రామన్నా" అంటూ బావిలోకి తొంగి చూశాడు సాహెబ్!

ఏమూతుందీ, దురదృష్టం కాక పోతే! చిత్రం ఏమిటంటే, ఆపెద్ద పులికివున్న ఆకలిపోయి, ప్రాణం దక్కించు కోటం ఎట్లాగా అని భయపడింది. తన ప్రాణం దక్కాలంటే రామన్న ఒక్కడే సాధనం అనుకొని, పులి రామన్న భుజాల మీదికి ఎక్కింది. రామన్న ఆబరువును మోయలేక, కొంత దూరంలోనే పట్టు వదిలేశాడు. ప్రాణం మీద వుండే తీపివల్ల చూశారా, పులికీ, రామన్నకీ స్నేహం ఏర్పడింది.

మళ్లీ బావిలో తాడువేస్తే రామన్నతో పాటు పులికూడ బైటకివచ్చి, అందరినీ చంపేస్తుం దేమోనని అంతా భయపడ్డారు. గఫూర్ సాహెబ్ "అపాయంలేని ఉపాయం ఏమిటా" అని దాడీ సవరించుకుంటూ ఆలోచించ సాగాడు. ఎక్కువ ఆలస్యం చేస్తే పులి రామన్నను తినేస్తుందేమోనని కూడా సాహెబ్ భయపడ్డాడు ఆలోచించి ఆలోచించి, చివరికి సాహెబ్, "అరేభాయీ!...మనం కోషిస్‌తో చేయాలిపడ్తాదీ. ఒకటి బడా ఎదుర్ క్రా తెచ్చి దివిటీ కట్టండి" అన్నాడు. కొంత సేపట్లో సాహెబ్ సలహా ప్రకారంచేశారు. మళ్లీ బావితో తాడువేశారు.

"రామన్నా భాయీ!-ఫికర్ సేయొద్దు నడుంకి రస్సీ ఘట్టిగా కట్కోని తాడుపట్కో—పులీ నీకీ పక్‌డేతోభీ భయం నక్కో, దాని పనీ నేన్ సంగంలోనే పూరాచేస్తా" అని సాహెబ్ రామన్నకు ధైర్యం చెప్పాడు.

మళ్లీ అంతా తాడు పట్టుకొని లాగుతున్నారు. పులికూడా మళ్లీ రామన్న భుజాలను పట్టుకుంది. రామన్న పులితో సగానికి పైగా వచ్చాడు. "నీకీ బయం నహీ రామన్నా, కళ్లూ మూస్కో—దాని పనిపడ్తా" అంటూ, ఎదురు క్రరకు కట్టిన దివిటీని వెలిగించి, గఫూర్ సాహెబ్ బావిలోకి వంగి, సూటిగా చూచి పులికళ్లకు అంటించాడు. ఇహ చూసుకోండి. పులి గాండ్రు గాండ్రు మని బొబ్బలు పెడుతూ రామన్నను వదిలి బావిలోకి పడిపోయింది. సాహెబ్ గంతులువేస్తూ, అరే జల్దీ లాగండి భాయ్!. బద్మాష్ పులికీ మార్ డాలాహం" అని అరిచాడు

పైకి లాగేప్పటికి రామన్నకు ఒంటిమీద స్పృహలేదు. అతని భుజాలకు పులిగోళ్లు కాట్లుపడ్డాయి. బావిలోంచి పులి ఇంకా ఘాండ్రిస్తూనేవుంది. నెమ్మదిగా రామన్నకు స్పృహ తెప్పించారు. తర్వాత సాహెబ్ సలహాతో రాళ్లుతెచ్చి ఒక అర్ధగంటసేపు బావిలోకి విసిరాడు ఆరాళ్ల వర్షానికి పులి చచ్చిపోయింది. నెమ్మదిగా దానిని బైటికితీసి చూశారు దాని కళ్లు మాడిపోయి వున్నాయి

చూశారా గఫూర్ సాహెబ్ పన్నిన అపాయంలేని ఉపాయం.

భలే బాగుందన్నయ్యా కథ—ఇహపోయి పడుకుందాం రారా చిన్న అన్నయ్యా!" అంటూ చెల్లాయి తన పక్కమీదికి పోయింది



# మహాసూతికావాత గజాంకుశము



ఈ ఔషధరాజము శిశువులకు కలుగు అజీర్ణం. విరేచనములు, మలబద్ధకము, వాంతులు, దగ్గు రొంప, ఉబ్బసం బాల పాపచిన్నె, అనాప జబ్బులదున్ను. పెద్దలకు దగ్గు, వగర్పు. ఉయాసము, గుండె నొప్పి, కలరా మూర్ఛ




పక్షవాతము యిందువలన మూతి వంకరబోవుట, మాట రాకపోవుట, ధనుర్వాతాది ఎనుబది వాతములు ఆస్తామా మొదలగు వ్యాధులకున్ను, స్త్రీలకు కలుగు ఋతుశూల గర్భస్రావము గర్భవిచ్ఛిత్తి, ఎనిమిది మాసముల లోపల గర్భము చెడుట. గర్భమందు శిశువు మృతినొందుట ప్రసవించిన వెంటనే శిశువు మృతిచెందుట, నెలలు పూర్తికాకనే గర్భిణులకు కలుగు కడుపునొప్పి. **మందు సేవించినవెంటనే నొప్పి ఆపి సుఖమిచ్చుట** ప్రసవించలేకుండుట 1-2 మోతాదులలో సుఖముగ ప్రసవింపజేయుట సూతికాది మహావాతములు, బాలింతలకు వాసనతో కూడియుండు తెలుపు 1-2 మోతాదులలో నివారించుట శ్లేష్మవ్యాధులు, న్యుమోనియా, డబుల్ న్యుమోనియా సమస్తజ్వరములు సన్నిపాతములకు (1-2 మోతాదులలో నివారించును.)

ఇయ్యది శరీరము చల్లబడి నాడి తగ్గి శ్లేష్మము కంఠగతమై పండ్లు గిట్టగరచి మందు దిగనిసమయమందు ఇంజక్షనులు చింతామణి మొదలగునవి నిరుపయోగమైనపుడు ఈ ఔషధము 1-2 మోతాదులు ఉపయోగించిన మరుక్షణమందే రోగిని మాట్లాడించి విల్లువగైరాలు వ్రాయించుటకు శక్తికలుగజేయుట, లేక చాలాకాలము జీవింపజేయుట.

ఇయ్యది మూడు తరములనుంచి మా ఆశ్రమమున వాడబడుచు ఎటువంటి తరుణ అసాధ్య దీర్ఘవ్యాధులయందైనను 5 మొదలు 15-20 నిముషములలో కస్తూరి యితర మందులు దినములకొలది వాడినను చేయలేని సుగుణము లెన్నియో యీమందు ఉపయోగించిన వెంటనే వ్యాధిని ఆటంకపరచి సుఖమును కలుగజేయును అప్పుడు జన్మించిన శిశువు లగాయతు బాల యవ్వనవృద్ధులవరకు స్త్రీ పురుషులెల్లరు సేవించవచ్చును మోతాదు హెచ్చుతగ్గులవల్లగాని అపథ్యమువల్లగాని ఎట్టి దుర్గుణములు కలుగజేయదు.

ఈ ఔషధము ఇండియా, బర్మా, సిలోను మొదలగు అనేక ప్రదేశములలోని వైద్యులు, ఉద్యోగస్తులు, శ్రీమంతులు, సామాన్యులవలన వాడబడుచు మిక్కిలి కీర్తి నార్జించి అనేక యోగ్యతాపత్రముల బడసియున్నది

తు 45-0-0 తు ½ 23-0-0 తు ¼ 12-0-0, తు 1/8 6-4-0, తు 1/16 3-4-0

పై ఒకే మందుకు నూతన వివరములతో 24 పేజీల అనుపానదీపిక ఆర్డరు యిచ్చువారు రు 2-0-0లు అడ్వాన్సు ఉచితసలహాకు 0-2-0 స్టాంపు పంపవలెను

## శ్రీ రామచంద్రాయుర్వేదాశ్రమమ్,

రాజవైద్య నరసింహం పంతులు, హెచ్ వి వి సన్సు,

రామచంద్రపురం, తూ॥ గోదావరి జిల్లా,

మద్రాసుకు దక్షిణ ఇండియాకు డిస్ట్రిబ్యూటర్లు.

ఎస్ ఎస్ శర్మ, 9 నూరె వీరాస్వామిఅయ్యరు వీధి, నుంగంబాకం, మద్రాసు 6

---

గడియారములు కొనేమందు గాని, రిపేరు చేయించేముందుగాని, మా షాపుకు దయచేయ ప్రార్థన

## షేక్ వీరా అండ్ సన్సు

పోస్టుబక్సు నెం 47-విజయవాడ



రిజిష్టర్డు డీలర్లు

**వెస్టు ,ఎండ్ వాచి కంపెనీ** 

**వెస్టె, డ్ ఫేవర్లూబా గడియారాలకు**

ఇంకా మావద్ద అన్ని రకముల హైక్లాసు వాటర్ ప్రూఫ్, ఆల్ ప్రూఫ్ గడియారములు సరసమైన ధరలకు దొరుకును

రిపేరింగు గ్యారంటీ

---

## వైబ్రా

గర్భాశయ రోగనివారిణి

సర్వ గర్భాశయ వ్యాధులను పూర్తిగా పోగొట్టి సంతానమును కలుగజేయుటలో మా వైబ్రా మిక్కిలి ఘనతవహించినది అన్ని షాపులలో దొరకును.

రు 2-8-0

KL

**కృష్ణా లేబరేటరీ**

★ బెజవాడ ★

---

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St , Madras

# ఆంధ్రపత్రిక

శ్రీ నందననామ సంవత్సర

# పంచాంగం

శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిసిద్ధాంతి
గారిచే గుణించబడిన

ఈ సంవత్సరం పంచాంగములో చాంద్రమాన, దృక్సిద్ధాంతాల ప్రకారం గుణింపబడిన రెండు పద్ధతుల తిథి, వార, నక్షత్రాదులు వేర్వేరుగా చూపబడినవి

---

## కొత్త పంచాంగాలు సిద్ధమౌతున్నవి

---

**డెమ్మి క్వార్టో సైజు వెల**

ప్రతి 1-కి 0-4-0

100-కి 18-0-0, 1000-కి 200-0-0

రైలుఖర్చులు ప్రత్యేకం.

1000 కాపీలు ఒకేదఫా కొనువారి చిరునామా ముఖపత్రిమున ముద్రించబడును

వివరాలకు వ్రాయండి.

**మేనేజరు - ఆంధ్రపత్రిక, మద్రాసు 1.**